# ముక్తావళి



కాకతీయ విశ్వవిద్యాలయం బి. ఏ, బి.యస్.సి, బి.కాం. మొదటి భాగం

తెలుగు గద్య పాఠ్యగ్రంథం

( 1981 - 82 సంవత్సరమునకు )





ప్రచురణ:

తెలుగు విభాగము

కాకతీయ విశ్వవిద్యాలయము

విద్యారణ్యపురి, వరంగల్లు - 506 009.

1981

# MUKTAVALI

Prose selections for B A, B. Com, & B. Sc, Part I
Telugu examinations for the year 1981 - 82

Copies 1000

Editors:
Prof: Rajeswara Sarma
Dr, K. Suprasannacharya
Sri, P, Jagannatham



Published by the Department of Telugu
Kakatiya University, Warangal.

First Print 1979
Second Print 1981

Price. Rs. 5-50

Copies can be had from:
The Registrar,
Kakatiya University, Warangal.

Printed at Venkataramana Mudranalayam, Warangal. Ph. 3970

# విషయసూచిక



# కృతజ్ఞతలు

ఈ పాఠ్యగ్రంథంలో తమ ప్రచురణలను ప్రకటించుకోవడానికి అనుమతించిన రచయితలకు, ప్రకాశకులకు కృతజ్ఞతలు.

* సంపాదకులు

# పానుగంటి లక్ష్మీనరసింహారావు

## కవుల కష్టములు

ఈ దినమున జంఘాలశాస్త్రి యొద్దనుండి రాఁదగినలేఖ రాలేదు. వినవచ్చిన వారందఱును లేఖ రాలేదని యెఱిఁగి యిండ్లకుఁ బోయిరి. "ఎందుల కాతఁడు వ్రాయలేదో తెలియలేదు. సభావ్యాపారము లేమియు మేము చూచుకొనుటయే లేదు. మూఁడునెలల కొక్కసారియైన స్వకీయ వ్యాపారములను చూచుకొనకున్న యెడల నెట్లు? ఆఱు మాసములనుండి సభామందిరమున కీయవలసిన బాడుగ యిచ్చుటలేదు. ఆయింటియాతఁ డడ్డకై మిగులఁ దొందరపడుచున్నాఁడు. పంచాయితీ కోర్టులో బాడుగసొమ్ముకై వ్యాజ్యము తెచ్చెదనని బెదరించుచున్నాఁడు. బొజ్జయ్యసెట్టి యుండిన యెడల నీచిక్కులు లేకుండెడివి. ఆతఁడు మరణించుట సభ కరిష్టము. అతనితావున కెవరైన వత్తురేమోయని చూడగ నెవ్వరింక రాకుండనున్నారు" అని నేను సంఘములోఁ బలుకగాఁ గాలాచార్యులు 'నాకొక్కయాలోచనము తోఁచుచున్నది. చెప్పుదునా' యని యడిగి యిట్లు పలికెను. "మనకుఁ గావలసినది ధనము. అది వ్యాపారమువలనఁగాని రాదు. పెద్ద పెద్ద వ్యాపారములు చేయుట కెక్కువ పెట్టుబడి కావలయును గాని స్వల్పవ్యాపారములకంత యక్కఱలేదు. నా కుపనయనకాలమందు "భవతి భిక్షాం దేహి" సూత్రఫలమైన యొక్క బంగారు చుట్టున్నది. దాని నమ్మి ప్రశస్తమైన చేఁబోఁతలు పొగాకు తెప్పించి పసదుగా నస్యమును జేసి, యుపన్యాసదినమున నఱుగుమీఁదఁ జిన్నదుకాణము పెట్టినయెడల జనాకర్షణసాధనముగను ధనాకర్షణ సాధనముగను నుండును. ఈ లుకలుకలన్నియు వదలిపోవును." ఇట్లు కాలాచార్యులు పలుకఁగాఁ "బొడుమంతయు నీవే పీల్చునెడలఁ జేతనున్న బంగారుచుట్టు ముక్కులోనికిఁ బోవుటయేకాక యింతకంటె ఫలమేమున్న"దని వాణీదాసు డధిక్షేపించెను. అంతటఁ గాలాచార్యు లామాటమాత్రము సత్యమే యని యొప్పుకొని పూర్వపక్ష రాద్ధాంతము లెఱిఁగినవాఁడగుటచేతను బూర్వమునఁ దిరువంట పల్లిలోఁ గైంకర్యమొనర్చిన వాఁడగుటచేతను "బెసరట్లదుకాణము పెట్టిన యెడలనో?" యని తిరుగ ధైర్యముతో వాణీదాసుని బ్రశ్నించెను. "పెనమెమ్రింగి జీర్ణించుకొనఁదగిన పెద్ద పొట్టవానికిఁ బెసరట్లులెక్కయా?" యని వాణీదాసుఁడు తిరుగ నధిక్షేపింపఁ గాలాచార్యులు వీలగునంత వఱకుఁ దన కడుపుఁ జూచుకొని

మందహాస మొనర్చి యటులైన ధనార్జనమునకు నస్యనిర్మాణము తక్క వేఱుదారి కానఁబడదని చెప్పి యూరకుండెను.

అంత వాణీదాసుఁ డిట్లనియెను. "మీ సాక్ష్యపన్యాసములు నాకేమియు నచ్చ లేదు. ఈ కాకిచెమ్మల యుపన్యాసములు గాలికిఁబోవునవే కాని నిల్చునవి కావు. ప్రపంచమునఁ గవిత్వమంత మధురమైనఁ వస్తువు మఱియొక్కటి లేదు. అందులో శ్లేషకవిత్వముమాట చెప్పనక్కఱయే లేదు. పదికాలములపాటు బ్రదికిన నదియే బ్రదుకవలయును. మనల బ్రదికించిన నదియే బ్రదికింపవలయును. జంఘాల శాస్త్రి వలె నుపన్యాసము లీయలేక నేనూరకుండలేదు. స్వల్పమైనకాలమట్లు వృథా చేయుట కిష్టపడక కవిత్వములో నెంత కృషియైన జేయుచున్నాను. ఇప్పటికి స్వామి కటాక్షమునఁ 'గంకణబంధము' పూర్తియైనది. అఱువదినాలుగర్థములు కూడ నేనే వ్రాసితిని. ఆగ్రంథమును మహారాజునకెవరికైనఁ గృతి నీయఁదలఁచి భాషాపోషకులని యెన్నఁబడు వారికెందఱకో వ్రాసియుంటిని. ఎవ్వరును బ్రత్యు త్తరము నిచ్చియుండలేదు. అంత గ్రంథమును గృతినొందుటకు మనకర్హత యున్నదా లేదా యని వారు సంకోచించుచున్నట్లు తోఁచుచున్నది. ఎవ్వరో యొక్క రంగీకరింతురని యాసతో నింక నున్నాను. ఆ కృతి భర్తవలన మనకు విశేష ధనలాభము కలుగవచ్చును, కాని యిప్పుడు భాషావిషయమున దేశము మిగుల దుస్థితిలో నున్నది. కృతి నిచ్చెదను స్వీకరింపవయ్యా యని కూడఁగూడఁ దిరిగినను నిప్పటిరాజులు పో పో యందురు కాని రా రా యని యనరు. పోనిమ్ము. పోతరాజుగారిని రాజు లాదరింపక పోవుట వలన నాయనకుఁ గలిగిన నష్టమెంతయో నాకు నంతే నేను మఱి యేఖండమునందో కొన్ని శతాబ్దముల క్రిందటఁ బుట్టియుండు నెడల నెందఱు ప్రభువులు నన్నాదరించి యుందురో?" ఇట్లు పలికి తనయందున్న దోషమును కాలమునందు దేశమునందుఁ, బ్రజలందుఁ, బ్రభువులందు, భగవంతుని యందు నారోపించి ప్రపంచధోరణిని దిద్దఁదలఁచినవాఁడు వలె యోజనాంతర్మగ్నుఁడయి యుండెను అంత నేనిట్లంటిని——

"నాయనా! వాణీదాసా! పోతరాజుగారిని రాజు లాదరింపలేదు నిన్నును రాజు లాదరింపలేదని పోతరాజుగారితో సామ్యమును దెచ్చుకొనుచున్నావా? నందీశ్వరునకుఁ గొమ్ములున్నవి. నాకును గొమ్ములున్నవని నత్తగుల్ల యఱచినట్లున్నది. నీవెక్కడ పోతరాజుగారెక్కడ? ఒక్కనోటితో మీ యిద్దఱినామము లుచ్చరించుట కైనఁదగదే! కుక్క తోఁకయు వంకరయే ఇంద్రధనుస్సును వంకరయే యన

సాహసించుచున్నావా? సెభాష్. పోతరాజుగారికి భోజనములేదు నీకును భోజనము లేదు. అందువలన నీ వాతనితోఁ దులఁదూగ నెంచితివా? నవాబుగారిది బోడితలయే నాదియు బోడితలయే యని వితంతువు విజ్ఞప్తిఁగినట్లున్నది. నీకేమి మతియున్నదా లేదా? పోతరాజుగారు రాజుల నాదరింపలేదా? రాజులు పోతరాజుగారి నాదరింపలేదా? శుకుఁడు వ్యాసుని విడిచెనా? వ్యాసుఁడు శుకుని విడిచెనా? కాశిలోఁ గాకరకాయను నీవు విడిచితివా? కాఁకరకాయ నిన్ను విడిచినదా? ఏమి వాణీదాసా! దేహమును విడిచి ప్రాణము పోయినదా? ప్రాణమును విడిచి దేహము పోయినదా? పోతరాజు గారిని నీతోఁ బోల్చుకొన్నందులకు నీమూఁతి మీఁదఁ బండ్లు రాలునట్లు గొట్టిన యెడలఁ, బండ్లు మూఁతిని విడిచిపోయినట్లా? మూతి పండ్లను విడిచిపోయినట్లా? మొదలేదో తుదయేదో తెలియకుండ మాటలాడుచున్నావేమి? కాడిక్రిందికి గుఱ్ఱము రాక పరిగెత్తగా గుఱ్ఱము బండిని విడిచిపోయినట్లా? బండి గుఱ్ఱమును విడిచినట్లా? ఏమి వాణీదాసా! తలతో నడుచుచున్నావేమి? బండిరాజులనో బురదరాజులనో పుట్టు రాజులనో పెట్టురాజులనో మంచిరాజులనో చెడ్డరాజులనో కంకణబంధముకొఱకు కాశ్రయించి యాచించితివికదా! వారేమన్నారు? పోపో యన్నారా? అన్నారా? అనఁదగిన వారు కావుననే యన్నారు. ఇప్పటిరాజులు స్వతంత్రరాజులుకారు, కావున నింతటితో సరిపోయినది కాని నీవీ కంకణబంధమును జేసినందులకు వారు నిన్ను ముక్కోణ మునఁగట్టి యుత్తర దక్షిణల క్రింద నిన్నుఁ జింత బరికెలతోఁ గొట్టింపవలసినది. పదునాలుగేండ్లు పాట్లు పడి పడి పద్యమొక్కటి వ్రాసితివా? కాలముయొక్క విలువ యైనఁ దెలియకుండ దేవులాడుచున్నావేల? పదునాలుగేండ్లా! అయ్యయ్యో! ఈపనికి మాలిన పద్యము చెప్పుటలో బడిన ప్రయాసతో నీవీ లోపలఁ బతంజలిభాష్యముతోడి పాణినీయ శాస్త్రమునందుఁ బండితోత్తముఁడవు కావచ్చునే! నీవీ దిక్కుమాలిన పద్యమునకు శ్రీరామ చుట్టుటతోడనే యెవ్వరికైనఁ బుట్టిన యాఁడుపిల్ల యీసరి కెదిగి యీడేఱి బిడ్డను గనియుండునే! ప్రాణాపాయవశాతుల్యమగు పదునాలుగేండ్ల ప్రసవవేదనతో నీవీ యిఱువదినాలుగు తలల రాకాసిబిడ్డనా కంటివి? నీదయ్యపు బుట్టువును ధరణిపతు లాదరింపలేదని వంశప్రతిష్ఠాశాశ్వతత్వమునకై దత్తస్వీకృతి నాదరించుకొనలేదని యాపుణ్యాత్ముల నధిక్షేపించుచుంటివా! అందుచేఁ గొన్నిశతాబ్ద ములక్రిందటనే ఖండాంతరమందైనఁ బుట్టకపోయితినని విలపించుచుంటివా? కవిత్వ మనగానేమో? కవిత్వమునకుఁ గారణమేమో! యెఱిఁగియున్న వాఁడవైన నీవిట్లనియుండవే! పూర్వకాలములోఁ బశ్చిమ ఖండములోనో యింకఁ బశ్చిమ గోళములోనో నీవు పుట్టి యిప్పుడు చెప్పిన కవిత్వమే యక్కడ జెప్పియుండిన యెడల నిన్నుఁ బిచ్చి యాసుపత్రిలో నుంచి యుందురో ? పద్యకావ్యముతో

బాటు వడఁదీసి కట్టఁగట్టి ప్రపంచపీఠ తీరునట్లు పసిఫిక్ మహాసముద్రమున బడవైచి యుందురో - పూర్వకాలములో - ఖండాంతరములందు బుట్టి పెరిఁగిన యదార్థకవులకే ప్రజాదరణము ప్రభుపోషణము లేనప్పుడింక కల్లకెంపునకా? కాకిబంగారునకా? విదేశీయ పూర్వకవులుపడినపాటులు సంగ్రహముగా జెప్పెదను, వినుము.

హోమరు అనునతఁ డైరోపాదేశమం దెఱిఁగియున్నంతవరకు మొదటికవి ఇతఁడు ప్రథమకవియే కాక ప్రథమభిక్షుకుడు. ఈతఁడంధుడు. ఇలియడ్ అడిస్సీ యను వీరరస ప్రధాన కావ్యరత్నముల నీతఁడు వ్రాసియుండుటచేఁ బశ్చిమదేశ వ్యాసుడు. ఇట్టి కవి చక్రవర్తి కన్నులులేక, కఱ్ఱచేతఁబుచ్చుకొని, టక్కుటక్కునఁ బొడుచుకొనుచుఁ గాలినడకను వీధులవెంట నొంటరిగా బయలుదేఱి ప్రతి గృహ ద్వారము నొద్ద నిలిచి, తాను రచియించిన పద్యములఁ బాడుచు ముష్టియెత్తు కొనుచుండెడివాఁడు. ప్రతిదినమును బద్యములతో నీతని నోరే నిండినది, కాని పట్టెడు రొట్టెతో నీతని కడు పెన్నడును నిండియుండలేదని వారి చరిత్రములోనే వ్రాయబఁడి యున్నది. మన దేశములోనే యాతఁడు పుట్టియుండునెడల నే మహారాజో యేడంత రువులమేడపై - హంసతూలికా తల్పమున — నీతనిఁ బెట్టి — సర్వోపచారము లాచరింపఁ జేసి యాదరించి యుండునే! ఆతని ప్రతిమ మన దేవతార్చనపుఁబెట్టెలో నుండునే? బ్రతికియుండినంతకాలమే యాతనియెడల నలక్ష్యము ననాదరణము కాదు, అతఁడు మరణించిన తరువాత నంతకంటె నెక్కువ యనాదరణమున కాతఁడు పాత్రుఁడై యుండెను. అతని గ్రంథములలో నీతి లేదని మంచిచెడ్డలకు భేదమే లేదని, మీఁదుమిక్కిలి దుర్నీతి ప్రబలముగా నున్నదని, దేవతల కసత్యము—క్రౌర్యము—అసూయ—ఆగ్రహము—వ్యభిచారము మొదలగు దోషము లారోపింపఁ బడియున్నవనియు, నాతని గ్రంథములు పనికిమాలినవని, భ్రష్టములని, పరిత్యాజ్యములని ప్లేటో నిర్ధారణపఱచినాడు. అతఁ డీకవిశిఖామణిని తన 'రిపబ్లిక్' నుండి బహిష్కరించినాఁడు. యూరపుఖండము నుండి ప్లేటోను బహిష్కరించినను లోపము లేదు. కాని హోమరును బహిష్కరించినయెడలఁ బశ్చిమశారదాదేవికిఁ దళయేది? అదిగాక యాతఁడు బ్రదికి యుండినకాలమందు శాసనము లేనేలేదు. తప్పొప్పులను గణించి తీర్మానించు చట్టమే లేదు. వ్యభిచార మాకాలమున దోషముగాఁ బరిగణింపబడి యుండనేలేదు. అందుల కాతఁడెట్లు బాధ్యుడు? తన కాలమందున్న సంఘస్థితిని దాను చిత్రించినాడు. అంతకంటె నాతఁ డేమిచేయగలడు? ఎవ్వఁడైన నేమి చేయఁగలఁడు? అందుల కాతనిఁ దిట్టు టెందులకు? దేవేంద్రున కహల్యాజారదోషమును దెచ్చిన వేదముల నెవఁడు తిట్టుచున్నాఁడు?

అప్పటి సంఘస్థితి యట్లుండెననునంతవఱకే మనము తెలిసికొనఁదగినది. అప్పటి సంఘస్థితి వఱకెందులకు? ఇప్పటి సంఘస్థితి మాత్రము పరిపూర్ణముగా నున్నదా? పదిదినముల క్రిందట జరిగిన యొకవృత్తాంతమును జెప్పెదను:—

ఒక పెద్ద పట్టణములో నొక పాకివాని కిద్దఱు భార్యలు. ఒకతె కళ్యాణపుఁ గక్కుర్తిచే గట్టుకొన్నది. వేఱొక్కతె భుజపరాక్రమమునఁ దెచ్చుకొన్నది. ఈరెండవది యంతకుఁ బూర్వము మఱియొక పాకివానిభార్య. ఆతనితో నిది కాపురము చేయుచుండగా నొక్కదినమున దివ్యమంగళ విగ్రహమైన మొదటఁ జెప్పిన పాకివాని నిది చూచి కిసుక్కుమనియెను. చేతను బాకిచేఁట నోట బొగాకు కిల్లి, నుదుటఁ బచ్చబొట్టు, కంటికొనల నిగిలింపుగల యీపాకీచకోరాక్షిని జూచి—యా పరమసుందరస్వరూపుడు—పగలు చూచిన రాతిరి స్వప్నములోనికివచ్చు సరస శిఖామణి—పరవశుఁడయ్యెను. మన్మథుఁడంతలోఁ గెవ్వుననార్చి పద్మబాణములను బాకిచేఁటల సందునుండి సవ్యాపసవ్యముగఁ గ్రుచ్చెను. వెంటనే యాతఁ డాపద్మగంధిని దనయింటికిఁ దెచ్చెను. భార్యాపహర్తయైన నీతని నాతఁడేమియు ననలేదు. కాని యీసవతుల గత్తర మాత్రము చూడఁదగినది, వినఁదగినది ........ ఇద్దఱు కలిసి యొకప్పు డాతనిఁ దన్నుదురు. వారి కనుదినము కలిగిన తగవుల నక్కన్నమాదన్నగార్లుకారుకదా, యుగంధర యౌగంధరాయణులు కారుకదా, భట్టి విక్రమార్కులు కారుకదా, బ్రహ్మాదిదేవతలైన దీర్పఁ జాలరు. ఇట్లు కొంతకాలము నవ్వులతో, నేడ్పులతో, గ్రుద్దులతో, నదుకులతో, ముళ్లతోఁ జరిగినపిమ్మటఁ దేరభార్య నీరుమోసికొనెను. దాని మొగము వికసించెను. సవతిమొగము సంకోచించెను. అపహృతభార్యుఁడగు పాకిఁవాడు తనభార్య యిట్లపహర్తృ ప్రయోజకత్వమున గర్భము ధరించినదను శుభవార్తను విని తనకు దవంతశ్రమయైన లేకుండ వంశము నిలువఁబడినదని మహానందము నొంది శుభదినమున షడ్డకుని యింటికి వచ్చి, చూలాలికిఁ బసుపు కుంకుమనిచ్చి క్రొత్తచీర కట్టబెట్టి! సారెపెట్టి జయజయ ధ్వానములతో సమస్తమంగళములతో, దానిని దన యింటికిఁదెచ్చుకొనెను. కులమువారందఱు కొనియాడిరి. దేవతల పుష్పవృష్టి యప్సరసల నాట్యమే తరువాయి కాని జరిగినవేడుకలన్నియు జరిగినవి. చూచితివా! పదిదినముల క్రిందట జరిగినచర్య యిది. జ్ఞానసూర్యుఁడంబరమున నడునెత్తికెక్కి ప్రజ్వలించుచున్న యీదినములలో తాలూకా బోర్డులలో—జిల్లా బోర్డులలో శాసన సభలలో-హరిజనులు సభ్యులుగా నుండి పరిపాలన తంత్రమున సాహాయ్యపడుచున్న యీదినములలో నిట్లున్నది. హోమరు కాలములో నింకఁ జెప్పెడిదేమి? అందువలన హోమరు నీతిబాహ్యుఁడా? చూచితిరా? ఆకవిసార్వభౌముని—ప్రభువులుగాని ప్రజలు

గాని యెట్లాదరించిరో! మఱియొకవిని గూర్చి చెప్పుదునా?

ఆంగ్లేయ దేశమున 'ఆట్వే'యనునతడు దుఃఖాంత నాటకకర్తలలో నొక్కఁడు. కరుణరస ప్రకటీకరణమున నీతఁడసమానుఁ డని ప్రసిద్ధిని గన్నవాఁడు. ఈతఁ డనేక నాటకములను వ్రాసెను. భుక్తిలేక యీతఁడు పైదేశమునకుఁ బోవుసేనలోఁ జేరెను. ఆసేన విడిపోయి నప్పుడింగ్లాండున కితడు తిండిలేక మలమల మాడుచు వచ్చెను. వీథిలోనికి ముష్టియెత్తుకొనుటకై పగలువచ్చుట కీతనికి వీఁపుపైనఁ జొక్కా పేలికయైన లేదు. చేతిలో జోలి మొదలే లేదు. అందువలనఁ జీఁకటిపడఁ జూచి దాగియున్న గుహలోనుండి వెలుపలికివచ్చి ముష్టియెత్తుకొను చుండెడివాఁడు. ఈతఁడు ఆట్వే కవిశిఖామణి యని యొక్కఁ డొక్కరాత్రి యెఱిఁగి యొక్క గినీ అతనిచేతిలోఁ బెట్టెను, అది రొట్టెల దుకాణమువద్ద మార్చి యొకరొట్టెనుగొని మూఁడుదినములనుండి యుపవసించుచున్న వాఁడగుటచే నత్యాతురతతో నారొట్టెను గొంతికి మ్రింగఁబోయి మ్రింగలేక నడువీథిలోఁ బడిచచ్చెను. చూచితివా! ఎట్టి మహాకవి కెట్టిమృతియో!

'స్పెన్సరు' అనుమహాకవి తిండిలేక మరణించినాఁడని బెన్‌జాన్సను స్పష్టముగాఁ జెప్పినాఁడు. అతఁడు వ్రాసిన 'ఫెయిరీక్వీను' అను గ్రంథము జదివి యిప్పటికి జనులు సంతసించుచున్నారు. అతఁడు బ్రదికినన్నాళ్లు పూటకు గతిలేక వలవల యేడ్చినాఁడు. భుక్తికేమియు దొరకక కడుపుపగిలి గుండె లవిసి యీ మహాకవిశిఖామణి కాలధర్మ మొందినట్లు స్పష్టము.

'ప్లాటస్' అనుకవీశ్వరుఁ డనేకనాటకముల రచించె. ఈతఁడు తిరుఁగటితోఁ బిండి విసరుకొని యందువలనవచ్చిన కూలిడబ్బులచే జీవయాత్ర చేసెను.

'టెరెన్సు' ఇతఁడొక బానిస. 6 నాటకములు 18 మొదలుకొని 25 సంవత్సరములవయసులోపల వ్రాసెనను ఖ్యాతి నొందినవాడు. స్వదేశమునఁ దినుటకేమియు దొరకకపోవుటచే నీతఁ డెక్కడికిఁ బోయెనో, యేమిచేసెనో, యెట్లుచచ్చెనో యెవ్వఁడు నెఱుఁగడు. 'బియోటియస్' అనుకవి కారాగృహములో మృతినొందెను. ప్రజల నిందలు, తిట్లు, క్రూరకృత్యములు, బహిష్కారములు భరింపలేక బైరను అను కవి మిస్సోలాంగు సమీపపుటడవులలోఁ గాఁబోలు దిక్కులేకుండ దేహపరిత్యాగ

మొనర్చెను. స్పెయిన్‌దేశములో 'సెర్వంటెసు' మహాకవి డాన్‌క్విక్సోట్ అను గ్రంథరాజమును వ్రాసినాఁడు. ఇతఁడు చెప్పరాని కష్టములన్నియుఁ బడిపడి తుద కొకకబళమునకైన గతిలేక మృతినొందెను. ఇటలీదేశమున పాలోబర్ఘిసీ అనునాతఁ డొకగొప్పకవి. ఇతఁడు కవిత్వముకాక పదునాలుగు వృత్తులు నేర్చుకొనెను. ఏ వృత్తిలోఁగూడ నీతనికి భుక్తి దొరకలేదు. ఇతఁడు రాత్రులందు గ్రంథములను వ్రాసికొనుటకు దీపమును దెచ్చుకొనలేక నీకన్నులను నాకెరువుగానైనఁ బ్రసాదింపు మని పిల్లిని సంబోధించుచు నొకపద్యమును వ్రాసెను. ఆదేశమందే 'బెంటినోగ్లియో' అనునాతఁడొక్క హాస్యరస ప్రధాన నాటకకవి. ఈతని నాటకములు ఇటాలియను భాష యున్నంతకాల ముండఁదగినవని చెప్పుదురు. ఇతఁడు మొదట భాగ్యవంతుఁడు. తనధనమును బరోపకారకములగు సత్కార్యములందు వ్యయపఱచెను. ఈతనికి వార్ధకమున దరిద్రత సంభవించిన వెనుక, నైశ్వర్యదినములలో నీతఁడు అనాతురులకై వేసిన ధర్మశాలలో నీతనిఁ జేర్చుకొనకపోవుటచే నడువీథిలో నోట గంజి యైనఁ బోసెడువాఁడులేక యీతఁడు మరణించెనని చెప్పుదురు. పోర్చుగల్ దేశమునఁ గవిసార్వభౌముఁడని బిరుదమందిన 'కామోయన్సుకవి' యాసుపత్రిలోఁజచ్చెను. ఫ్రాన్సుదేశమున 'వాజిలాక్సీ' అను నొక్కకవి యుండెను. ఈతఁడు తిండిలేక చేసిన ఋణమును ఋణప్రదాతలడిగిపోవుదురేమోయను భయముచేఁబగలెల్లనేతొట్టిలోనో దాఁగి రాత్రివేళల బిచ్చమెత్తుచుండెడివాఁడు. అందువలన నీతనికి గుడ్లగూఁబ యని పేరు. తాను మరణించినపిమ్మటఁ దనదేహమును వైద్యుల కమ్మఁజూపి రాఁదగినంత సొమ్ము రాబట్టి యాసొమ్ముతోఁ ఋణములను దీర్పవలసినదని యాతఁడు మరణ శాసనమును వ్రాసెను. 'వాల్టెరు' మహాకవిని—అతనినిబట్టి యాతని చెల్లెలిని-మహా ఫ్రెడరిక్కు యెంత పరాభవించినాఁడో లోకవిదితమే. "కెస్సాండరు" అనునాతఁడతని కాలములోని కవులలోఁ బేరొందినవాఁడు. ఈతనికిఁ బ్రభువులుగాని ప్రజలుగాని దేహధారణమునకు సాహాయ్యమొనర్పకపోవుటచే నతఁడు నరదూషకుఁడై, భరింప రాని యాతనలచే భగవద్దూషకుఁడు కూడనయ్యెను. అతనికి మరణము సన్నిహిత మైనప్పుడు మతగురు వాతని పక్కయొద్దకువచ్చి "కరుణాళుఁడైన భగవంతుని యందు హృదయము లగ్నము చేసికొను" మని హెచ్చరించెను. అంత నాతఁడు "భగవంతుని కరుణాళుత్వము నే నెఱుఁగనిదికాదు. ఇప్పటికి నాయం దాతఁడు దయ చూపనప్పు డిఁకముందు చూపునని యేమి నమ్మకము" అనియెను. "అయ్యయ్యో? అట్లుకాదు. దైవకటాక్ష మిప్పటికి రాలేదని యింక ముందు రాదనఁ గూడదు. అదెప్పటికి రావలయునో పరమాత్మడే యెఱుఁగును. నీవు దైవకృపను నమ్మి యాతనియందుఁ బరిపూర్ణ విశ్వాసయుక్తుఁడవై మృతినొందు" మని మత

గురువు మందలించెను. "అక్కఱలేదు. అక్కఱలేదు. బ్రతుకులో భగవంతుడు నా కెంతసాయపడినాడో నీవెఱుఁగుదువు. చచ్చుచుండఁగా నెంతసాయపడుచున్నాఁడో చూడు" మని తన ప్రక్కకై పఱచుకొనిన వట్టిగడ్డిని జూపెను.

పూర్వకాలమున ఖండాంతరములందుఁ గవులఁ బ్రభువులు ప్రజలు నెంత బాగుగ నాదరించిరో యిప్పుడు తెలిసినదా? రోఁత—రోఁత—మహాపాపము భూలోకనరకము. కవు లిట్లుపడినబాధలు చెప్పఁగూడదు–వినఁగూడదు–తలపఁగూడదు. ఆకాలములో నాదేశములం దెచ్చటనో పుట్టకపోయితినని యేడ్చుచుంటివా! మీఁదు మిక్కిలి కవి పోషకులగు మన దేశప్రభువులను దూషించుచున్నావా? నీకు మతి యున్నదా లేదా? ఏది? ప్రభువుల యనాదరణమున మనదేశములోఁ దిండిలభింపక మరణించిన యొక్కకవిని—కవివఱకెందులకు? ఒక్కమనుజుని వ్రేలుమడఁచి చెప్పుము. కవులకు రత్నాభరణము లిచ్చినవారు—గజాశ్వపల్యంకి కాదివాహనము లిచ్చినవారు—అగ్రహారము లిచ్చినవారు—అర్ధసింహాసన మిచ్చినవారు—అన్నిటి కంటె మనసిచ్చి—మామా—బావా—యని వావివరుసలతోఁ బిల్చుకొన్నవారు—మహారాజులు—త్యాగమూర్తులు—కీర్తిస్వరూపులు – లోకోపకారులు – శాశ్వతజీవులు అవతారపురుషులు మనదేశమున నెందఱో చెప్పవలయునా? వారందఱు సారస్వతాంబరమున సహస్రసహస్ర భానుప్రకాశ సందీప్తితో వెలుఁగుచున్నారు. అప్పటి మాటలేల? ఇప్పుడో? రాజులో యితర ధనవంతులో కవుల నాదరించుచున్నారు. గ్రంథములు వ్రాయించుచున్నారు. శారదాసేవన మాచరించుచున్నారు. దేశోపకారులై ప్రకాశించుచున్నారు అట్టి మహానుభావులు, వితరణశీలురు సర్వశ్రేయముల ననుభవించుచు సంపూర్ణాయుస్సమేతులై విద్యలను బోషించుచు వెలయుచుందురుగాక!

# శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

## 'సర్వాయి పాపఁడు'

సర్వాయి పాపఁడు ఔరంగజేబు పాదుషా యంత్యకాలమున నున్నవాఁడు. ఇతఁడు పాదుషా యవసాన కాలమునం దాతని రాజ్యమునందలి హైదరాబాదు-ఓరుగల్లు ప్రాంత దేశముపై దాడివెడలి కోటలను ముట్టడించుచు, నగరములను గొల్లపెట్టుచు వచ్చినందున నౌరంగజేబు పాదుషాను గుఱించి వ్రాయునపుడు మహమ్మదీయ చరిత్రకారు లీతని చరిత్రమును గూడ వ్రాయకతప్పినది కాదు.

సర్వాయి పావని కథలోని సత్యమరయుటకు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియుంచిన చరిత్రములే కాని మన కితరాధారములు లేవు. సర్వాయి పాపని గుఱించి పాడఁబడు పాటలు సంపూర్తిగ నయిదాఅయినను దొరకుచో వీనిని, మహమ్మదీయ చరిత్రములను బరిశీలించి సత్యమును దేల్చుట కవకాశ మెక్కువ యుండును. మహమ్మదీయుల కోటలను ముట్టడించి వారి నగరములను దోఁచుకొని, వారి రాజ్యమున కలఁబడిఁ గలిగించిన వానిని గుఱించి మహమ్మదీయు లాతఁడు బందిపోటు దొంగ యనియుఁ బ్రజలను హింసించు వాఁడనియు నేమేమో వ్రాసినారన్న నందు వింతయేమియు లేదు. వారు వ్రాసినట్లు నిజముగా నాతఁడు దొంగ యేనా యని మనము విచారింపవలసి యున్నది. కాని హిందూదేశ మధ్యయుగ చారిత్రమును మనము పరిశీలింతుమేని యప్పుడు నీతియు రీతియుగలిగి మెలఁకువతో నెవ్వఁడు పదిమందిని జేరఁదీసి పదియూళ్ళను జయింపఁగలిగెడువాఁడో వాఁడే దొర యని తెలియును. ఇట్లు కోటలను ముట్టడించియుఁ బట్టణములను దోఁచుకొనియుఁ, గేవలము ప్రజోపద్రవము కలిగించుటయే పరమావధిగాఁ బెట్టుకొనక యెవ్వఁడు కోటలను గట్టి పాళెగాఁడై, సంస్థాన సంస్థాపకుఁడై రాజధర్మమును వెలయించుచు వచ్చెనో వాఁడే రాజు. ఆ దినములలో బలమున్నవానిది రాజ్యము. ఆ కాలమట్టిది. దొంగలే దొరలు దొరలే దొంగలు. కాని యిరుతెఱఁగుల వారిని వేఱుపఱుచు ముఖ్య లక్షణము లివి: ఒకరు తమ కణఁకువయైన దేశమున ధర్మమును బాటించి ప్రజాహితము సేయువారు- వీరు దొరలు: ఇఁక రెండవవారు తమ కణఁకువయైన దేశమునఁగూడఁ బై విధులను బాటింపక స్వలాభపరాయణులై దోఁచు

కొనుచుఁ బ్రజలను హింసించువాఁడు, సర్వాయిపాపఁడు దొంగయో దొరయో మనము నిర్ణయించి చెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. అతఁడు నిజాం రాజ్యమున 'భోనగిరి' పరగణాయందు 'షాహపుర' దుర్గమును గట్టించి, దానిని దనకుఁ బ్రధాన స్థలము చేసికొన్నవాఁడు; పిదప నతఁడు తాడికొండ దుర్గమునుగూడ నిర్మించెను. ఈ దుర్గములకుఁ దా నధిపతియై మహమ్మదీయ రాజ్యముపై దాడి వెడలి వారి కుపద్రవము గలిగించుచు వచ్చెను. దుర్గములను నిర్మించి. దుర్గములను సాధించి రాజ్యమును విస్తరింపఁజేసికొనఁ బ్రయత్నించినవాఁడు దొర కాక దొంగ యెట్లగును? కాని యతని ప్రజాపరిపాలన మెట్లుండెడిదో మనకుఁ దెలియదు. సర్వాయిపాపని కథలను (పాటలు—పదములు) మన మెంత యెక్కువగను, సంపూర్తిగను సంపాదింపఁగలిగిన నీతని చారిత్ర మంత స్పష్టముగఁ దెలియుట కవకాశము కలుగును. ప్రజాదరణములేక క్రమక్రమముగ వీధి భిక్షుకుల నోళ్లలో నవసిపోవుచున్న యీ పాటలను జరిత్రాభిమానులు మేల్కొని యెంత త్వరితముగ సంరక్షించిన దేశ చరిత్రమున కంతలాభము: లేనిచోఁ జరిత్రమునకు నష్టము వాటిల్లునని వేఱే చెప్ప నక్కఱలేదు.

సర్వాయిపాపని గుఱించి మహమ్మదీయ చరిత్రకారులు చెప్పు సంగతులకును మనకు దొరకిన పాటలోని సంగతులకును గొన్నికొన్ని వ్యత్యాసములు గనఁబడుచున్నవి పాట ననుసరించిచూడ నితఁడు పుట్టినది బెలగాము. కాని మహమ్మదీయ చరిత్రములు చూపిన నీతని జీవిత కథలో బెలగాము ప్రసక్తియేరాదు. పాటలో నితఁడు పెరిగినది తాటి(డి)కొండయనియుఁ గులమున నితఁడు గవుండ్లవాఁడనియుఁ దల్లి సర్వమ్మ యనియుఁ గలదు. చరిత్రమునఁ (చరిత్రమనఁగా నిచట మహమ్మదీయులు వ్రాసిన చరిత్రయని యర్థము చేసికొనునది) దా(డి)కొండయం దీతనికిఁ గావలసినవారు చాలమంది యుండినట్లును, నాదుర్గము నీతని క్రిందనే యుండినట్లును దెలియును చరిత్రకూడ నీతఁడు గవుండ్లవాఁడేయని చెప్పుచున్నది: కాని యందుఁ దల్లి పేరు లేదు. అది యటుండ సర్వాయి, పాపరా ('పావరా' అనియే మహమ్మదీయ చరిత్ర లీతనిం బేర్కొనుచున్నవి) అను పేరుగల వారిరువురున్నట్లు మహమ్మదీయ చరిత్రము చెప్పును. ఇది పొరపాటు కాఁదగును. కథలోఁ బాపని తల్లి పేరు సర్వమ్మ యని స్పష్టముగఁ జెప్పబడినది: సర్వమ్మనే సర్వాయి యనఁదగును ఇట్టి రూపాంతరములు తెలుఁగుదేశపు స్త్రీల పేర్లలో మనము చాల గమనింపగలము. 'సర్వాయి' కొడుకు గనుక పాపనికి సర్వాయి పాపఁడని పేరువచ్చియుండును. చరిత్రకూడ నితఁడు మొదటఁ గల్లుగీసికొను వాఁడనియుఁ దరువాతఁ గొంతమంది

నేస్తకాండ్రను జేర్చి యిట్టి దుండగములు సాగించెననియుఁ జెప్పుచున్నది. ఇతని ధనలాభమును గురించి కూఁడ జరిత్రమునఁ గలదు. ఇందును గురించి చరిత్రమున నిట్లు కలదు. "పాపనికి నితంతుపైన యొక సోదరి యుండెనఁట; ఆమె చాల ధనవంతురాలట. ఎప్పుడో యొకప్పుడామె ధనముపైఁ బాపని కన్నుపడుట తటస్థించెను. ఆ ధనమును దనకిమ్మని పాపఁడామెను వేధించెను. ఎంతకు నామె ధన మియ్యకపోఁగాఁ బాపఁడామె నత్యంత దారుణముగను గ్రూరముగను హింసించి, యొడ లంతయుఁ గాల్చి తుదకా ధనమును గైకొనెనట" దానితో సైన్యములను జేర్చి, తాను నాయకత్వమును వహించి, మహమ్మదీయ రాజ్యముపై దండయాత్రలు సాగించెను; పాపఁడు తల్లినే హింసించి ధనమును గైకొన్నట్లు పాటలోఁ గలదు. పాటలో నితఁడు గోలకొండను ముట్టడించి, దానిని బరిపాలించుచుండిన నవాబును జయించి, యేడు గడియలకాలము గోలకొండ గద్దెపై నెక్కి రాజ్యము చేసెనని కలదు. చరిత్రమున నితఁడు గోలకొండ రాజ్యమును జయించి యేలుట కాదుగదా, తుదకు గోలకొండ ప్రస్తావనమైన లేదు అందితఁ డోరుగల్లు ముట్టడించి జయించెనని కలదు. ఒకవేళ మనము పాటలో 'గోలకొండ'కు బదులుగ 'ఓరుగల్లు'ను జేర్చుకొనవలసియుండునేమో. పాటలోని 'ఏడుగడియలు' అనునది నిజముగా నేడు గడియలే యని విశ్వసింపనక్కఱలేదు. ఏడు గడియలకాలము మాత్రమే రాజ్యముచేసెను సంగతి యెవ్వరికిని విశ్వసనీయమైనది కాదు. ఏడు గడియలనుదానిని నత్యంత స్వల్పకాలమనుటకు గుర్తుగనే గైకొనవలసియుండును. పాటకుఁ జరిత్రకు నింకొక్క విషయమున మాత్రము వ్యత్యాసము కలదు మహమ్మదీయ సైన్యములు పాపని నోడించి యాతనిని జెఱపట్టెననియుఁ దుద కాతనిని దురక ప్రభువులు ముక్కలు ముక్కలుగఁ జెండాడి, హైదరాబాదు కోట గుమ్మమునకు వ్రేలఁగట్టిరనియుఁ జరిత్ర చెప్పుచున్నది, నోటమి గలిగిన పిదప నంత పౌరుషముగ బ్రదికిన తాను జీవముతో శత్రుహస్తములఁ బడరాదని పాపఁడు తనకుఁ దానే బాకుతోఁ బొడిచికొని మరణించెనని పాట చెప్పుచున్నది. ఇందేది నిజమో దైవమునకెఱుక; ఈ రెంటిని బరస్పర విరుద్ధములు గాకుండనిట్లు సమన్వయము చేయవచ్చును. పాపడు మహమ్మదీయులచేఁ బరాజితుడై చెఱపట్టబడిన పిదప బాకుతోఁ బొడిచికొని మరణించి యుండవచ్చును. కాని మహమ్మదీయులు, తమ్మాతఁడు పలువిధములఁ బలుమాఱులు వేధించి యుండుటచేతఁ గసితీఱక యా చచ్చినవానినే తుండె తుండెములుగ నఱికి యాతనిని హైదరబాదు కోట గుమ్మమునకుఁ వ్రేలఁగట్టి యుండవచ్చును. ఇట్టి సందర్భములు దేశ చరిత్రమున లేకపోలేదు. మహమ్మదీయ చరిత్రమునకును, మన పాటకును గల వ్యత్యాసము

లింతవఱకుఁ దెలుపఁబడినవి. ఇఁక మహమ్మదీయ చరిత్రముల ననుసరించి తెలియనగు పాపని జీవితము సంగ్రహముగఁ బొందుపఱుపఁబడును.

“పాపరాయఁడు కల్లుగీయు గవుండ్లకులమున జన్మించినవాఁడు. అతనికిఁ జాల భాగ్యవంతురాలయిన వితంతు సోదరి యొకతె యుండెను. ఇతఁ డొకనాఁ డామెను జూచుటకు వెళ్ళెను. నాలుగైదు దినము లామెయింట నున్నతరువాత నతనికన్ను లామె విలువధనముమీఁద, నాస్తిమీఁద పడెను కొంతమంది స్నేహితులను జేర్చుకొని యతఁడామె నత్యంత క్రూరముగను, దారుణముగను హింసించి, యొడలు కాల్చి ధనము దాఁచియుంచిన చోటు తెలిసికొని యా ధనమును, నగలు నన్నియు సంగ్రహించి దానితోఁ గొంతమంది కూలి బంటులను జేర్చి, దారులుకొట్టి ప్రయాణీకులను దోఁచుకొని, చుట్టుపట్ల దేశమును గొల్లపెట్టఁ జొచ్చెను,

ఫౌఁజుదారులు, జమీన్‌దారులు నాతనిదుండగములను జూచి యాతనిని జెఱపట్ట నిశ్చయించిరి. ఏవిధముననో వారి నిశ్చయ మతనికిఁ దెలిసి యతఁడు ‘కొలాన్’ జమీన్‌దారు వేంకటరావు నొద్దకుఁ బారిపోయి యతని కొలువునఁ గుదిరెను. కొంత కాల మైనపిదప నతఁడ జమీన్‌దారు కొలువునందే యున్న మఱియొకనితోఁ జేరి జమీన్‌దారుని యనుమతిగాని, యాజ్ఞగాని లేకయే తనంతఁదానే చుట్టుపట్ల దేశమును దోఁచ మొదలిడెను. వేంకటరావిది తెలిసికొని వారిని బట్టి బంధించి కారాగారమున నుంచెను. కాని వేంకటరావు కుమారుఁ డొకప్పుడు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. చెఱనున్న ఖైదీలయుసురు తగిలి తన కొడుకున కారోగ్యముచెడెనని తలంచి వేంకటరావు భార్య తన కుమారుఁడు పునరారోగ్య వంతుఁడగుచో ఖైదీలను విడిపించెదనని తలఁచుకొని, తుద కామె కోర్కె సఫలమగుటచేత వారి నందఱను విడిపించెను.

పాపరాయఁడు నల్గొండపరగణా భోనగిరి సర్కారులోని ‘షాహపురము’నకు వెళ్లి యక్కడ ‘సర్వా’యను మఱియొక దుండగినితోఁ గలిసి, మరలఁ గొంత మందిని జేర్చి షాహపురము నొద్ద గుట్టమీద నొక మట్టికోట కట్టించెను. ఆదుర్గము చాల దిట్టమైనది ఆప్రదేశ మాతనికిఁ జాల ననుకూలముగ నుండినది. అచ్చట నుండి యాతఁడు చుట్టుపట్ల దేశమును దోఁచుకొన మరలఁ బ్రారంభించెను. షాహపురమున కేడెనిమిది క్రోశముల దూరమున నున్న కుల్పాక్‌పరగణా ఫౌఁజుదారు కొంత సైన్య మిచ్చి కాసింఖాన్ అఫ్గాన్ అను వాని నాతనిపైఁ బంపెను. ఈ సైన్యమునకును, పాపనికి నప్పుడప్పుడు పోరాటము సంభవించుచుండెడిది. ఇదే తరుణమునఁ గుల్పాక్ పరగణాకు సంబంధించిన యొకగ్రామమును పాపఁడు పట్టుకొనెను. ఈ తడవ

కాసింఖాన్ పాపనిసైన్యములపైఁబడి చాలమందిని హతముఁ గావించి, పాపని దళముఁగొట్టెను. కాసింఖా నింకను నాతనిని వెంబడించుచుఁ బోఁగా, నొక గుండుదెబ్బ తగిలి యాతఁడు ప్రాణములు విడిచెను. నాయకుఁడు నేల నొఱగిన పిదపఁ దురకదళము గచ్చువిచ్చయి చెదరిపోయెను. మహమ్మదీయు లింతటితో నిస్పృహులై యూరకుండలేదు. మరియొక తడవ వారు దండెత్తి వచ్చి పాపని 'సర్వాను' షాహపురదుర్గమున రెండు నెలలవఱకు ముట్టడించిరి. కాని పాపరాయఁడు తప్పించుకొని పాఱిపోయెను. అప్పుడు తురక లామట్టికోటను నాశనము చేసిరి.

తురకదళములు వెళ్ళిపోయిన పిదపఁ బాపరాయఁడును, 'సర్వా'యుఁ దిరిగి వచ్చి షాహపురమునందే యీతడవ మట్టికోటకు బదులుగ ఱాతితోను, సున్నముతోను, నొక క్రొత్త కోట కట్టించి, ఫిరంగులు మొదలైన యుద్ధసామగ్రి నందు నెక్కొలిపిరి. పాపరాయఁడు మరల దోఁపిడీ యారంభించెను. ఈతడవ నతఁడు షాహపురమునకుఁ బదునైదు, ఇరువది క్రోశముల దూరమునందున్న దేశమునంతను దోఁచుకొనెను. ఈ దేశమునందలి ప్రజలు పాపరాయనిఁ బట్టి శిక్షించుటకుఁ దగు సాధనముల నరయవలసినదని ఔరంగజేబు పాదుషాను బ్రార్థించిరి. పాదుషా రుస్తుందిల్‌ఖాన్ అనునతనిని హైదరాబాదు సుబేదారుగా నియమించి, పాపరాయని బట్టుకొనవలసినదని యతని నాజ్ఞాపించెను. రుస్తుందిల్‌ఖాన్ (ఈతని పేరు కొన్ని చరిత్రములలోఁ బుర్‌దిల్‌ఖా నని కలదు) తన సైన్యములను గొన్నిటిని బాపరాయని పైఁ బంపెను. కాని యవి యోడిపోయిన పిదప సుబేదారే స్వయముగ నాయకత్వము వహించి షాహపురదుర్గముపై నెత్తి వెళ్ళి దానిని రెండు మూఁడునెలలుముట్టడించెను. కాని కోట స్వాధీనము కాలేదఁట. రుస్తుందిల్‌ఖాను పాపనివలన నుండి బహుమతులు వడసి వెడలిపోయెనఁట. దానిని లంచమన్నను, గప్పమన్నను పాపఁడు మరల నెప్పుడు నట్టి దానిని సుబేదారున కిచ్చి యుండలేదు. రుస్తుం దిల్‌ఖాన్ వెడలిపోయిన పిమ్మటఁ గూడఁ బాపఁడు తన యాటలను సాగించుచునేయుండెనని కొన్ని చరిత్రలు చెప్పుచున్నవి. రుస్తుందిల్‌ఖాన్ సైన్యములతో వచ్చి షాహపురదుర్గమును ముట్టడించి 'సర్వ'ని బ్రాణోపద్రవకరముగ గాయపఱిచెను. కాని తురకా సేనాధిపతియే హతుఁడయ్యెనని మఱికొన్ని చరిత్రములు తెలుపుచున్నవి.

అటు తరువాతఁ బాపరాయఁడు యుద్ధసామగ్రిని, సైన్యములను నభివృద్ధి చేసికొని కోటలు సాధించుటకుఁ బూనుకొనెను. ఔరంగజేబు పాదుషా మరణానంతర (క్రీ.శ. ౧౭౦౭) మతని కుమారుడు 'కాంబక్ష్' బిజాపుర, హైదరాబాదు రాజ్యము

లకుఁ బాలకుఁడయ్యెను. అతఁడుకూడఁ బాపరాయని నణఁచుట కంత గొప్ప ప్రయత్నములు చేయలేదు. కాని యెవరో యొకరి సైన్యాధిపత్యమునఁ దురకదళము తడవదడవం బాపనిమీఁదికి వచ్చుచునేయుండెను. ఇట్టి 'ఖిల్లే'తోఁ దురక లొకసారి 'షాహపుర' దుర్గమును గూడ ముట్టడించిరి కాని ప్రయోజనము లేకపోయెను. ఇట్టి యుద్ధములలో సాధారణముగ విజయము తన పక్షముననే యుండుటవలనను, గాంబక్షు కూడఁ దన్నెదుర్కొనుటకుఁదగినన్ని గట్టి ప్రయత్నములు చేయకపోవుటవలనను బాపరాయనికి మఱింత ప్రోత్సాహము కలిగి, యతండు షాహపురమునకు ముప్పది మైళ్ళ దూరమున నున్న యోరుగంటిపై నెత్తి వెళ్లెను.

క్రీస్తుశకము ౧౭౦౮-న మొహరము పండుగలలోఁ బదవనాఁడు పాలకులైన మహమ్మదీయులును, బాలితులైన హిందువులునుగూడ వేడుకలయందును, వినోదముల యందును దన్మయులై కాలముఁ బుచ్చుచుండఁగా, రెండుమూఁడు వేల కాల్బలము తోను, నాలుగయిదువందల గుఱ్ఱముదళముతోను బాపరాయం డోరుగంటికోటయొద్దఁ బ్రత్యక్షమై, తన రాక పట్టణమునకుఁ బోవు దారులన్నియు మూసివేయించెను. తెల్లవారకపూర్వమే గుర్రపుదళము పట్టణమును ముట్టడించు ప్రయత్నమున నుండఁ, గాల్బలము కోటగోడల నెక్కి దానిని సాధింపఁ జొచ్చెను. అనతికాలముననే కోట పాపరాయని యధీనమయ్యెను. లక్షలకొలఁది రూప్యముల యాస్తియు, నగదును, సుప్రసిద్ధములైన యోరుగంటి తివాసులును దోఁపిడికాండ్ర వశమయ్యెను. స్త్రీలును బురుషులును, బిల్లలును గలిసి ౧౨,౦౦౦ మంది చెఱపట్టఁబడిరి. ఈ ఖైదీలలో నోరుగంటి 'కాజీ' మహమ్మదు సయ్యదు భార్యయుఁ, గూఁతురును గూడ నుండిరి. మహమ్మదు సయ్యదు భార్యను దానుంచుకొని, పాపరాయఁ డెనిమిది తొమ్మిది సంవత్సరముల వయస్సుగల యాతని కూఁతురి నాట పాటలు నేర్పి వారి వృత్తి నవలంబించుటకై వేశ్యల కొసంగెను.

తరువాతఁ బాపరాయఁడు హైదరాబాదునకుఁ బదునాలు క్రోశముల దూరమున నున్న భువనగిరి (భోనగిరి)పై దండెత్తి వెళ్ళెను. అక్కడఁ బట్టణమును బేఁటను గూడ దోఁచుకొని యతఁడట నుండి రెండు మూఁడువేల మంది స్త్రీపురుషులను ఖైదీలుగాఁ గొనిపోయెను. పిదప నతఁడు షాహపురమునకు నాలుగు క్రోశముల దూరముననున్న తరికొండ (తాటికొండ) దగ్గఱ మఱియొక కోట కట్టెను. ఆకోటలోఁ గూడ నాతఁడు గొప్ప సైన్యము నుంచి, చాల యుద్ధసామగ్రిని జాగ్రత్తపఱిచెను.

నిరాటంకముగను, యథేచ్ఛముగను దోపిడులు సాగించు నీ పాపరాయని యుద్ధతికిఁ దాళలేక యోరుగంటి ప్రాంతములవారు స్వయముగ సైన్యములతో వచ్చి యాతని దర్ప మడుపవలసినదని ప్రార్థించుచు ఢిల్లీ చక్రవర్తియైన బహాదుర్‌షాకు మహజర్నామా పంపుకొనిరి. సామ్రాజ్య సైన్యమును దీసికొని స్వయముగ నాయకత్వము వహించి, యొక కల్లుగీసికొను వానిపై దండెత్తి వెళ్ళుట తనవంటి వానికది గౌరవప్రదము కాదని, తన ప్రతిష్ఠకది భంగకరమని తలంచి "బహాదుర్‌షా" చక్రవర్తి యుక్తిపరుడును. జాబుకైన వాఁడునగు యూసఫ్‌ఖాన్ "రుజ్ బిహాని" అను వానిని పాపరాయని నొంచుటకుఁ బంపెను. యూసఫ్‌ఖాన్ సైన్యములతోఁ దనపై కింకను రాకపూర్వమే పాపఁడు షాహపుర దుర్గమున కెనిమిది క్రోశముల దూరమున నున్న 'కుల్పాల్' నగరమును ముట్టడించెను. ఇంతలోఁ దురక దండొకటి వచ్చి యాతని కపారనష్టమును గలిగించి యాతనిని షాహపురమునకుఁ దరుమఁగొట్టెను.

ఒకప్పు డాతఁడు షాహపురమున లేనిసమయమునఁ గోటయందలి ఖైదీలు కొందఱు చెఱనుండి తప్పించుకొని కోట వశపఱచుకొనిరఁట. గ్రామాంతరమున నుండి వచ్చి పాపరాయఁడు మరలఁ దనకోటను లోఁబఱచుకొనుటకై దానిని ముట్టడింపవలసి వచ్చెను. ఈ సమయముననే కుల్పాల్ ప్రాంతముల నుండి యూసఫ్‌ఖాన్ సైన్యములు కూడ నాతనిపై నెత్తివచ్చెను పాపఁడీవతల నీ దళములతో పోరాడవలసి వచ్చిన కారణమున షాహపుర దుర్గమును వశపఱచుకొనఁజాలక పోయెను. షాహపురము శత్రువులకు వశమయ్యెను. షాహపుర దుర్గమున ఖైదీల "పితూరి" రేఁగి కోట వారి యధీనమగుటకును, సరిగాఁ బాపఁడు తన కోటను దాను వశపఱచుకొను సందర్భమున నుండఁగనే తురకలదం డాతనిపై నెత్తివచ్చుటకును యూసఫ్‌ఖాన్ తంత్రమే కారణమై యుండును. పాపరాయఁడెట్లో యీయుద్ధమున శత్రువుల బారిఁ బడకుండఁ దప్పించుకొని తరికొండ (తాడికొండ)కుఁ బాఱిపోయి యాదుర్గమున దాఁగుకొనెను. శత్రుసైన్యము లాతని వచ్చుటకుఁ గూడ వెంబడించి తఱిమి తరికొండ కోటను ముట్టడించినవి. ఇచ్చటఁగూడ పాపరాయని ధైర్యకంచుకము సడలలేదు. అతఁడు కోటను సంరక్షించుచుఁ దొమ్మిది మాసములు హోరాహోరి శత్రువులతోఁ బోరాడెను. నిశ్చలదీక్షతో నీ తొమ్మిదినెలలు శత్రువులాకోటను ముట్టడించి దానిని వశపఱచుకొనఁ బ్రయత్నించుచునే యుండిరి. దండోపాయమున నెన్నినాళ్ళకుఁ గోటవశము కావందున శత్రువులు భేదోపాయము నుపయోగించిరి. ఈ తంత్రమువలనఁ బాపరాయనికి నమ్మిన బంటులాగ నుండిన యాతని వ్యజనమే

యాతనిని విడిచిపెట్టి వెళ్ళిపోయిరి. అటుపిదప శత్రువులు మరల మరలఁ గోటపైఁ గవిసి దానిని క్రమముగా లోఁబఱచుకొనఁ జొచ్చిరి. పాపఁడెవ్వరికిని దెలియకుండ నొంటరిగఁ దాడికొండకు రెండు మకాముల దూరముననున్న హసనాబాదు గ్రామమునకుఁ బాఱిపోయెను. తాడికొండ కోటలో నతఁడున్నదియు లేనిదియుఁగూడ రెండు దినములవఱ కెవ్వరికిఁ దెలియనేలేదు. హసనాబాదు నందలి ప్రజలు కొందఱు స్వామిద్రోహముఁ గావించి యాతని యునికిని, మనికిని దురకలకుఁ దెలియఁజెప్పిరి.

తరువాత శత్రువులు వచ్చి హసనాబాదును గూడ ముట్టడించి, పోరాటమునఁ బాపని గాయపఱచి ఖైదీగఁ గొనిపోయి యూసఫ్‌ఖాన్ ముందుంచిరి. తాను గొల్లగొట్టిన ధనమెచ్చట దాచియుంచెనో సంపూర్తిగఁ దెలుపువఱకు వారాతనిని బ్రదికియుండనిచ్చి పిదప వధించిరి. అతని శిరస్సును జక్రవర్తికిఁ బంపిరి. చిత్రవధచేసి యాతని మొండెమును హైదరాబాదు పట్టణద్వారమునొద్ద వ్రేలాడఁదీసిరి.

జన్మముచేత గవుండ్ల కులమువాఁడయినను నున్నత లక్ష్యప్రేరితుఁడయి, శౌర్య సాహసములను వెలయించి, దుర్గాధిపతియై, సంకల్పసిద్ధిని బొంది, తుదకు దైవ దుర్విపాకమున దుర్మరణము పాలయిన సర్వాయి పాపనికథ పరిసమాప్తమయినది. కాలగర్భపుఁ బొరలలో మఱుఁగుపడి పోయిన యట్టివారల జీవితము లింకను వీధి భిక్షుకుని ప్రాఁతజోలె దులిపిన నెన్నిరాలునో? తిరిపె మెత్తుకొను వీధి పాటకుని తంబురతీఁగ మీటిన నెన్ని మ్రోగునో? సర్వాయి పాపని కథవంటి చరిత్ర పదములు దేశమునఁ బూర్తిగ నింకను నణఁగిపోయి యంతరింపకమునుపే సేకరించి జాగ్రత్త పఱచి, చారిత్రకముగ వ్రాసి విలువను వివరించి ప్రకటించుట చరిత్రాభిమానుల ముఖ్య ధర్మము.

# శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

## 'తానాజీ మాలుసురే'

వీరమాత జిజీబాయి యొకనాఁడు దంతపు దువ్వెనతోఁ దలదువ్వుకొనుచుఁ దన ప్రతాపగడ్ కోటపై నుండి తూర్పుదిక్కు చూడగా మధ్యందిన మార్తాండుని కిరణ ప్రసారముచే నిగనిగమను తెల్లని మేడలతోఁ గోడిగుడ్డువలె మెఱయుచు "సింహగడ్"కోట దూరమందుఁ గనుపించెను. ఆదిక్కు నట్లే చూచుచు, దీర్ఘాలోచన నుండి విషాదములోఁ బడి "నిన్న మొన్నటి వఱకు మా వశమందుండి, నేఁడు మా మతద్వేషియగు నౌరంగజేబు వశమయ్యెగా"యని క్రమముగాఁ గ్రోధావేశము నొంది, వెంటనే యొక సవారును "రాయగఢ్‌లో నున్న తన కుమారుని-ఛత్రపతి శివాజీ మహారాజును-తత్‌క్షణమే యెట్లున్నవాని నట్లే, భోజనము చేయుచుండినను మానుకొని, చేయినైనను గడుగుకొనక రావలసినదిగా నా యానతి వినుపింపుము" పొమ్ము! అని యాజ్ఞాపించెను. మాతృవాక్య పరిపాలకుఁడగు శివాజీ పనులను వదలి కొని, వార్త వచ్చిన వెంటనే పయనమైవెళ్ళి, తనతల్లికాళ్ళపై దలవాల్చెను. జిజీబాయి కొడుకును సర్వదిగ్విజేతవు కమ్మనిదీవించి తనతోఁ బాచికలాడుమని నిర్బంధించెను. శివాజీ నిరాకరించెను. జిజీబాయి స్వభావముచేఁ బట్టిన పట్టు వదలవట్టి ధీర. అతనికి ఒప్పుకొనక తప్పదయ్యెను. పందెములో శివాజీ యోడిపోయెను. 'అమ్మా, పందెము నీవే గెలిచితివి. నీ యిష్టమున్న కోటను దీసికొనుము' అని పలికెను.

'నాకు సింహగఢ్ కోటయేకావలెను. ఈ యోటమికి దాని గెలుపే నేను గోరు పరిహారము' అని తల్లి చల్లగా వినిపించెను.

"అది యిప్పుడు నాతోఁగానిపని."

"అయితే నేను పిఱికివాని తల్లిననియా నీ యభిప్రాయము?"

"కాదు కాదు ఆ కోట యత్యంత దుర్భేద్యమైనది. ఎన్నివేల సైన్యముతో ముట్టడివేసినను వశము కానట్టిది."

"అయితే యేమాయె! నాకాకోటయే కావలయును. నీకీ మధ్య యెవ్వరో పిఱికి మందు పోసినట్లున్నది."

"ఆ కోటను సంరక్షించువాఁడు ఉదయభానుఁడను మహ
పుత్ర, పఠాన్, అరబ్బు వీరులా కోట నేమరక కావలి కాయుచున్నా
గొంత కాల మాఁగుఁడు, చుట్టుపట్టుల కోటలను గ్రమముగా సాధిం
అదియు సాధించి తీరుదును."

"ఎన్నఁడో సాధించుట నాకు సరిపడదు. నా కిప్పుడే
వలయును."

శివాజీ దీర్ఘాలోచనా నిమగ్నుఁడై యెట్టకేలకుఁ దల్లికి మాట
దన వెంట రాయగఢ్-కోటకుఁ బిలుచుకొని పోయెను.

ఈ సాహస కార్యము నెవ్వరు నిర్వహింతురో కదా య
యాలోచించు చుండఁగా 'ఉమ్రాతే' సుబేదారును, మహాశూరుఁ
నాయకులలోఁబేరు గన్నవాఁడును నగు తానాజీ జ్ఞాపకమునకు వచ్చెన
రమ్మని యాతనికి జాబు వ్రాసెను. తానాజీ తన కుమారుఁడగు
వివాహము నిశ్చయించి పెండ్లి యేర్పాటు సందడిలో మగ్నుఁడై
ఛత్రపతి పంపిన జాబుచూచిన వెంటనే పెండ్లికార్యము లన్నియు నా
తీసుకొని, తన పినతండ్రి యగు శేలార్‌తోను, తమ్ముడగు సూర్యాజీ
మంది మావళీలతోను దన యేలిక సేవలో వచ్చి చేరెను. తాను శివా
డగుటచేతను, జనువుకల వాఁడగుటచేతను "ఏమయ్యా! కొడుకుపెం
నియ్యవు. ఇంత తొందరపని యేమివచ్చి నెత్తినఁబడినది," అని
"నాకేమి తెలయునోయీ! మన అమ్మగారిని విచారింపుము" అని
కొనెను. జిజీబాయి సమయస్ఫూర్తి కలిగినట్టిది. తానాజీ యామె
రుమాలును బెట్టి 'తల్లీ, నీకేమి కావలయునో సెలవిమ్ము సాధించి తె
అని పలుకఁగానే 'నాయనా! నీవంతటి వాఁడవనియే కదా పిలిపించితిని.
వీరుఁడవు. నా శివాజీ తర్వాత నీవే నాకుఁ బుత్ర సమానుఁడవు. నీ
కార్యముండునా.' అని పలుకుచు, జ్యోతిని వెలిగించి యతని మొగ
మారులు త్రిప్పి, 'చిరంజీవుఁడవు కమ్ము' అని తలపై మెటిక
నాకు సింహగఢ్ కోటను వెంటనే వశపఱచి యియ్యవా? ఇదే నేను
కోరిక' అని తిన్నగాఁ దెలిపెను.

శూరాగ్రేసరుఁడగు తానాజీ జంకు కొంకులేక రెండవ యాలోచన యేమియుఁ జేయక 'అదెంతపని. ఇప్పుడే బయలుదేరుదును. కోటపై తెవటివఱకు మనజెండా నెగుర వేయుదును. జయసూచకముగా ఐదు తోపులు కాల్పింతును. నీకేమియు సందేహము వలదు' అని పలికెను. శేలారు సూర్యాజీలలోను, దన వెయ్యిమంది మావళీలతోను దానాజీ మాల్సురే సింహగఢ్‌కుఁ బ్రయాణమయ్యెను. కోట కొకటి రెండు కోసుల దూరములోనే అడవులలోఁ దన సేనను దాచియుంచి తానాజీ యొక్కఁడే కోటను సమీపించెను, కోటకొక మైలు దూరములో నడవి జాతివారగు 'కోలీలు' అతనిని బట్టుకొనిరి. 'ఓయీ, నేను సఖారాం గ్రామము పటేలును, మీ రెఱుగరా? వేఁటకై రాఁగాఁ బెద్దపులి తఱుముటచే నిటు పారివచ్చితిని. అని వారికి నచ్చఁజెప్పి, చెలిమి చేసుకొని, వారికి దములపాకులు, వక్కలు, నల్లమందు పంచి పెట్టెను. కోలీలు సంతోషపడిరి. అటుపై వారికి ధనము, బంగారు బహుమతీగా నిచ్చెను. వారు పూర్తిగా వశవర్తులైరి. అప్పుడు వారికి యదార్థమంతయుఁ జెప్పి తనకుఁ గోట మర్మమంతయుఁ జెప్పినఁ గోట సాధించిన తర్వాత వారందఱకు మంచి మంచి యినాములు శివాజీ మహారాజుచే నిప్పింతుననెను. కోలీలిట్లు చెప్పిరి:-

“కోటను ఉదయభానుఁడు 800 మంది రాజపుత్రులతోను. పఠానులతోను, అరబ్బులతోను గాపాడుచున్నాడు. ఉదయభానుఁడు బలాఢ్యుఁడు. వాఁడు తిండిలో బకాసురుఁడే పూటకు వాని కొక్కనికే యొక మేకపోఁతు కావలయును. వానికి 12 మంది భార్యలు 12 మంది కొడుకులు. వాని సేనాని సిద్దీహిలాల్. వాడు హిడింబుని కన్ననో తమ్ముఁడో యనునట్టివాఁడు సిద్దీహిలాలునకు 9 మంది పెండ్లాలు. కోటలో చంద్రావతి యను మనుష్యుఁ జంపు గజమున్నది. కోట నలుదిక్కుల రాత్రిం బగళ్ళు కావలి కాయుదురు ఏ దిక్కు చూచినను నెక్కుటకు వీలులేదు. కాని తూర్పుదిక్కున నుండు కళ్యాణీ ద్వార సమీపమందలి డోంగ్రె గుట్టయొద్ద నేమైన మీరు సాహసించిన సాహసింప వచ్చును’

తానాజీ నడిరేయి మీఱిన తర్వాత మెల్లఁగా దన తావునుండి సేనతోఁ గదలి కళ్యాణీ ద్వారము నొద్దఁజేరి యక్కడఁ దన తమ్ముఁడగు సూర్యాజీని సైన్యములో నుంచి నూఱు మంది సాహసికులను మాత్రమే తీసికొని డోంగ్రె గుట్టదిక్కు నడిచెను. శివాజీ పెంచినట్టి 'యశ్వంత్' అను నుడుమును దనవెంటఁ దీసికొని వెళ్ళియుండెను. ఈ యశ్వంత్ ఇదివఱకే 27 కోటల నెగఁబ్రాకి శివాజీకి గొప్ప సేవచేసి యుండెను. తానాజీ యశ్వంత్ నెత్తిపైఁ గుంకుమ బొట్టుపెట్టి టెంకాయలు

కొట్టి పూజించెను. తర్వాత దాని నోటిపైఁ దేనెపూసి నడుమునఁ ద్రాడుకట్టి కోట గోడపై విడిచెను. ఉడుములకుఁ దేనెయనిన యమృతప్రాయము. దాని వాసన తగిలిన నది దొరకు వఱకుఁ బర్వతములుగాని మహావృక్షములు గాని యెగబ్రాకు చుండును యశ్వంతు తేనె వాసనచే నేటుగా సూటిగాఁ బ్రాకుచుఁ బైకి వెళ్లెను. తానాజీ మొట్ట మొదటఁ దన ఖడ్గమును బండ్లతో బిగఁబట్టి త్రాడు పట్టుకొని పైకెగఁ బ్రాకెను. తర్వాత పినతండ్రి శేలారెక్కెను. తర్వాత 48 మంది వఱకు భటు లెక్కిరి. అంతలో యశ్వంతు నడుమునఁగట్టిన త్రాడు తెగిపోయెను. కోటపైన 50 మందియే యుండిపోయిరి. శేలారు భయగ్రస్తుఁడై దుముకఁబోయెను. తానాజీ తన ఖడ్గమును ఝళిపించి, కంఠము నెగురమీటుదునని భయపెట్టి యా 50 మందితోనే కోటలోఁ బ్రవేశించెను.

అంతటను నిబిడాంధకారము, కోటలోని సిపాయీలు గాఢనిద్రలో నుండిరి. తానాజీ చప్పుడు చేయక వారిని దీర్ఘనిద్రలో ముంచి, మొదటి ద్వారమునొద్ద నుండు సిపాయీలను జంపి, కల్యాణి ద్వారముదిక్కు నడిచెను. ఇంతలోఁ గోలా హల మయ్యెను. సిపాయీల నందఱను మేలుకొలుపుటకై దబదబ నగరా మోగ్రయింప బడెను. సింహగడి వారు శత్రువు లెట్లువచ్చిరో, యెందఱు వచ్చిరో, యేమూలలో నేమైనదో యని భయగ్రస్తులై తమ యేనుఁగును మొదట శత్రువులపై విడిచిరి. అది తానాజీ యుండు తావునకు వచ్చి. తొండముతోఁ దానాజీ భటులను విసరికొట్టఁ దొడఁగెను. తానాజీ యొకటే దెబ్బతో దాని తుండమును నఱికి, దానిపై కెగిరి మస్తకముపై ఖడ్గప్రహారములు చేయుచుఁ జంపి కూల్చెను. సిద్దీహిలాలున కీసంగతి తెలిసి, తన తొమ్మండుగురు భార్యలను జంపి ఖడ్గహస్తుడై తానాజీపైఁ బడెను. శత్రువులు కొలది మందియేయని గ్రహించి, హిలాలిట్లు పలికెను "అరే సూటిగా యమునియొద్దకే యేల వచ్చితిరి? పూరి గఱచి చెప్పులు నెత్తినఁబెట్టుకొని క్షమార్పణ గోరికొనుఁడు. లేకున్న మీ పెద్దల మీకిప్పుడే చూపింతును." తానాజీ ప్రత్యుత్తరము కరవాలము చేతనే యిచ్చెను. సిద్దీ తలపై బలముకొలఁది దెబ్బ కొట్టగాఁ దలనుండి కంఠము వఱకు రెండు పాయలుగాఁ జీరి వాఁడేనుఁగువలెఁ గూలఁబడి పీనుఁ గయ్యెను.

తానాజీ భటులు కొందఱీ కోలాహలములోఁ గళ్యాణి ద్వారము నొద్దకుఁబోయి ద్వారపాలకులతోఁ బోరి వారినిఁ జంపి ద్వారమును దెఱచిరి. సూర్యాజీ తన సైన్యముతో భీకర ధ్వనులుచేయుచు లోపలఁ బడదుమికెను.

సారా మత్తుచేఁ దన భార్యలతో లీలా విలాసములందుఁ బ్రొద్దు పుచ్చుచున్న యుదయభానునికి దుర్వార్తలన్నియుఁ దెలిపెను. ఆ తత్తఱపాటుచే మైకమంతయు క్షణములో దిగిపోయెను, తన కుమారులను యుద్ధము చేయఁబంపెను; వారు చచ్చిరని విని తిచ్చవడెను. తుదకుఁ దన భార్యల నందఱను దన కత్తికి బలియిచ్చి స్వయముగా యుద్ధరంగములోఁ జొరఁబడెను.

ఉదయభానుఁడు భయంకర స్వరూపుఁడును, వల్లనివాఁడును, గూర్ధరకర్కశకాయుఁడునునై యుండెను. తానాజీ కూడఁ దక్కువవాఁడు కాడు. అతఁడించుమించు 50 సంవత్సరముల ప్రాయమువాఁడు, ఆజానుబాహుఁడు, విశాల వక్షస్థలము, భయంకర శ్మశ్రువులును గలవాఁడు. పెద్ద తలపాగను ధరించినాఁడు, సాముచేఁ గండలు తిరిగిన యంగములు కలవాఁడు: ఖడ్గమును ద్రిప్పుటలో మహానిపుణుఁడు. ఉభయ వీరులకు నఱగంట కాలము తీవ్రముగా పోరు జరిగెను. తానాజీ యాయుఃప్రమాణము పూర్తియై యుండెను. ఉదయభానుని ప్రహారములచేఁ దానాజీ నిహతుఁడై యేనుఁగువలెఁ గూలిపడెను. తానాజీ పినతండ్రి శేలారు వెంటనే యుదయభానునిపైఁ బడి వానిఁ బొడిచి చంపెను. మొగల్ నాయకు లందఱును హతులైరి. కోటలోని వారికిఁక దిక్కెవ్వరును లేకపోయిరి. బయటి సైన్యము లోపలికిఁ బ్రవేశించి 1000 మందికి పైఁగా హతమొనర్చెను. మిగిలినవారన్ని దిక్కులఁజెదరిపోయిరి. హతశేషులు శరణువేఁడి ప్రాణములు దక్కించుకొనిరి.

సూర్యాజీ ఢిల్లీ జెండాను గ్రిందికి లాగి చించి పారవైచి, తమ కాషాయ ధ్వజము నెక్కించెను. అయిదుతోపులు కాల్పించెను. ఆ నిశ్శబ్ద నిశీథమం దావిజయ ధ్వానములు రాయ గఢ్‌లో ప్రతిధ్వనించి విజయఢంకా మ్రోగించెను. సింహగఢ్ కోట శిఖరముపై బండ్లకొలఁది కస్బెలఁ గాల్చి నెగళ్ళువేయఁగా మింట మంటలు ప్రజ్వలించెను. అవియే రాయగఢ్‌కు ఆ కాలపు నిస్తంత్రి వార్తలయ్యెను.

తెల్లవారు వఱకు శివాజీ మహారాజు సింహగడిని జేరెను, సూర్యాజీ శేలారు మున్నగు వారందఱు వతని నెదుర్కొని జయజయ ధ్వానములతో స్వాగతమిచ్చిరి. కాని తనకుఁ బ్రాణతుల్యుఁడై తన తల్లిచేఁ దనకు సోదరుఁడుగా నియమింపఁబడిన తానాజీ మాత్రి మెదురుగా రాలేదు. ఆ ధూరాగ్రేసరుఁడు తప్పక కోటకు బలియయ్యెనని గ్రహించెను. ఆనంద మంతయు విషాదముగా మారెను. ప్రసన్న వదనము విషాదచ్ఛాయలు కప్పుకొనెను. ప్రశాంతముగాఁ గోట నెక్కుచుఁ

టోయెను. కోట యంతయుఁ దానాజీ కొఱకై వెదకుచు వెదకుచు, నలుదిక్కులఁ జూచుచుఁ దిరిగెను. తానాజీ శవమును జూచిన వెంటనే యా శవమునొద్ద నిలిచి యట్లే యాతనిని జూచుచుఁ గన్నీరు కార్చెను. శవమును కౌగిలించుకొనెను. ఎవరో యొకరు "మహాప్రభూ! ఏల దుఃఖించెదరు. ఎవరును సాధించనట్టి యీ సింహగఢ్ కోట 50 మందితోనే మఱల మీవశమయ్యెను గదా!" అని హెచ్చరించిరి. శివాజీ దుర్భర విషాదముతో నిట్లు వాపోయెను.

'గఢ్ ఆలా: పణ్ సింహ్ గేలా'
('గడి వచ్చెను: కాని సింహము చచ్చెను')

# శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

## 'శ్రీకృష్ణదేవరాయల రాజనీతి'

శ్రీకృష్ణదేవరాయ విరచితమైన ఆముక్తమాల్యదను స్మరింపగనే మనకు ముఖ్యముగ జ్ఞప్తికి వచ్చునవి యందలి విష్ణుభక్తుల వర్ణనలు, ఋతువర్ణనమునై యున్నవి. వీనివలె రసవంతమైనది కాకపోయినను, రాయలు చేసిన రాజనీతి ప్రసంగము విజ్ఞానప్రదమై యా గ్రంథముయొక్క యుజ్జ్వల ఘట్టములలో నొకటిగా వెలయుచున్నది. మోక్షవిద్యయైన వైష్ణవధర్మ సిద్ధాంతములందాత డెంత యాసక్తి గలవాడో లౌకిక విద్యయైన రాజనీతియందును నంత శ్రద్ధకలవాడే. రాయలు నిక్కపుకర్మ యోగియని యెంచుట యత్యుక్తి కాదు. పరమభాగవతులయ్యును. ఐహికవృత్తమునే మరచి జ్ఞాతులు ఖాండిక్య కేశిధ్వజులవలె రాయలుకూడ హరిభక్తిసాగరము నందోలలాడుచునే, తన విధ్యుక్తధర్మమైన ప్రజాపరిపాలన కర్మను పేక్షింపక సర్వాత్మనా నిర్వహించినవాడు. కేశిధ్వజుడు పలికినట్లు కృష్ణదేవరాయలుకూడ నా విద్యచే మృత్యువును తరియింప నెంచినవాడుగనే తోచును, కేశిధ్వజుడన్న మాటలు -

'ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప
ననఘ రాజ్యమును మఖాదికములు
జేయుచున్నవాఁడ, క్షీణింపఁ జేయుదుఁ
బుణ్యఫలము భోగభుక్తి వలన'

అంధ్ర వాఙ్మయమునందు రాజ్యతంత్రమును గూర్చి చెప్పగలవారు పలువు రుండిరేమో కాని చెప్పినవారు మాత్ర మిద్దరే కానవచ్చుచున్నారు. ఒకరు కవి బ్రహ్మ తిక్కనసోమయాజి. రెండవవారు శ్రీకృష్ణదేవరాయలు. వీరిలో విజ్ఞానము నందు తిక్కనయే ఘనుడయ్యును, అనుభవమునందు రాయలు మిన్నయనుట సత్యము. మంత్రి శిఖామణి తిక్కన త్రిప్పిన రాజ్యనౌక మిక్కిలి చిన్నది. అత్యల్ప జీవితము కలది. రాయలట్లుకాదు. కృష్ణకు దక్షిణమున కన్యాకుమారివరకు నేల నాలుగు

దెంగులు నతనియాజ్ఞకు లోబడి యుండినది. విజయనగర సామ్రాజ్య ముదయించి రాయలనాటికి మూటయేబది సంవత్సరములు గడచిపోయినవి. ఈ దీర్ఘకాలము నందెందరో సమర్థులైన రాజన్యులు ఆ సామ్రాజ్యనీతిని దిద్ది రాయలకు నొరవడి పెట్టియుండిరి. రాష్ట్రముయొక్క యంతర్వ్యవస్థయందు నన్యరాజ్యములతో సంబంధములు నిర్వహించుటయందు వారెన్నియో ప్రయోగములు చేసియుండిరి. వానిలో జయాపజయములను సాధించిరి, ఇట్టి గొప్ప రాజరికపు వారసత్వముతో సంక్రమించిన సామ్రాజ్యమును మహోన్నత విజయ శిఖరములకు గొనిపోయినవాడు శ్రీకృష్ణదేవరాయలు. సామాన్యుడగు రాజమాత్రుడు తనకు ముందుండిన రాచరికపు చట్రమును కదల్చుటకు శక్తిగాని, రక్తిగాని లేకయుండును. అసమర్థుడట్టి చౌరవచేసినచో నతని వినాశనమునకో, రాజ్యహానికో, దారితీయును. రాయలు మహా ప్రతిభాశాలి, మంచినీటికి సొరచేపవలె నతనిబుద్ధి రాజ్యతంత్రమున నెదురెక్కును. పరిపాలనా తంత్రము నందింతటి మేధావి తమలో జన్మించెనని యాంధ్రులెందరో గుర్తించు కున్నారు, తిక్కనామాత్యుడు మహారాజనీతి ప్రవక్తయనుట నిస్సందేహము. ఇద్దరును గురువులే, ఇద్దరును వంద్యులే. ఇచ్చట మనము అర్థశాస్త్ర నిర్మాతయైన కౌటిల్యుని స్మరింపవలెను. అతని ప్రవచనమిట్లున్నది, 'అధ్యక్షులనుండి వార్తను, వక్తృప్రయోక్తల నుండి దండనీతిని నేర్చుకొనవలెను' రాజనీతి విషయమై తిక్కన వక్త, రాయలు ప్రయోక్త, వక్తయుపన్యాసము కన్న ప్రయోక్త యనుభవము కొన్ని సందర్భములలో మిన్నయై యుండుట సహజము.

ఆంధ్రవాఙ్మయములో రాజనీతి కథనము చాలవరకు ఆంధ్రమహాభారతము నందే లభించుచున్నది. మూలమహాభారత విషయములనే తిక్కన సోమయాజి తన స్వచ్ఛమైన యనుభవదర్పణమునందు ప్రతిఫలింపజేసుకొని యక్లిష్టముగ, తేటతెల్లముగా ప్రకటించినాడు. శాంతిపర్వమునందు రాజనీతి ప్రసంగము విపులముగ చేయబడినది, కృష్ణదేవరాయలు అంతవిపులముగ చెప్పుటకు పూనుకొనలేదు. కాకయు నతడు రాజనీతిని గురించిన గ్రంథము వ్రాయనుద్దేశించినవాడు కాడు. రాజరికమునందు తన ప్రత్యేకానుభవములు కొన్ని సూత్రించి రాబోవు తరములవారికి మార్గము చూపుటకు మాత్రమే ఎనుబదిపద్యములలో తన యఖండ ప్రజ్ఞాప్రదర్శనము గావించెను. అగద్య పద్యములు సూత్రప్రాయములై పూర్వాపర సందర్భవివరణ పూర్వకముగా గొప్ప వ్యాఖ్యానము నపేక్షించుచున్నవి. అతని శైలియు భావసంభరితమై పర్వతారణ్య మార్గమువలె విషమమై యుండుట, వేద్యాంశము సులభగ్రాహ్యముగాకుండును.

దండనీతియందు రాయలు చక్కని శిక్షణమునే పొందినట్లు అతడు వ్రాసిన పరిమిత గ్రంథమును బట్టియే వ్యక్తమగుచున్నది.

ఆముక్తమాల్యదయందు రాజనీతి ప్రసక్తి వచ్చిన సందర్భము అందరెరిగినదే. యామునాచార్యుడు భోగానుభవవిస్మృత విష్ణుపాదకమలుండై జడతవహించి యుండగా, ఆతని పితామహుండైన నాథముని ప్రశిష్యుడు శ్రీరామమిశ్రు డుపాయము యామునునికి ప్రబోధించెను. యామున ప్రభువు సహజబోధకము కలవాడగుటచే వెంటనే తెలివితెచ్చుకొని రాజ్యమును కుమారాధీనముచేసి తురీయాశ్రమము స్వీకరింప బోవుచు పుత్రప్రీతిచే కొన్ని విశేషరాజధర్మములను బోధించి వెడలిపోయెను. ఇదియే రాయలరాజనీతిజ్ఞతా ప్రదర్శనమునకు కలిగిన యదను. ఖాండిక్య కేశిధ్వజ సంవాదమునందు కూడకొన్ని యంశములు సంగ్రహముగా ప్రసక్తములైనవి. రాయల రాజనీతి సూక్తులను కొన్ని విభాగములుగా చేసి పరిశీలించుట విషయ వైశద్యమునకు తోడ్పడును. ఆయా సందర్భములలో మహాభారతము, కౌటిల్యుని అర్థశాస్త్రము మున్నగునవియేమి చెప్పినను పరికించుట లాభదాయకమగును అర్థశాస్త్ర ప్రవచనము ననుసరించియే మహాభారత శాంతిపర్వము నందలి రాజనీతి యుపన్యస్తమయ్యెనని కొందరు సూచించిరి. కాని ఇది విశ్వసనీయముగ తోపదు, దండనీతి యావిర్భావమును, ఆవశ్యకతను, విస్తారముగ చెప్పిన శాంతిపర్వ కథనము, దండనీతి ప్రయోగమునందు గహనాతి గహనమార్గ సంచారము చేసిన అర్థశాస్త్ర కథనము కన్న ప్రాచీనమని భావింపవలసి యుండును ఆముక్తమాల్యద వక్కణము అర్థశాస్త్రమునకు సన్నిహితమై దానికి మెరుగులు పెట్టునదిగా ఉన్నది. చాణక్య అపరనామకుడగు కౌటిల్యుడు చంద్రగుప్తమౌర్యుని మహాసామ్రాజ్య చక్రప్రణేత. కృష్ణదేవ రాయలు స్వయముగ మహాసామ్రాజ్య ప్రవర్తకుడు. ఉభయులును అనుభవ సంపన్నత నాకలే, కౌటిల్యుని అర్థశాస్త్రమునందు కొందరు భావించినట్లు అపనమ్మకము–ప్రతారణము–రాజతంత్ర మూలసూత్రములుగ భాసించును. రాయలరాజనీతియందును వీనికి స్థానములేక పోలేదు. కాని దానియందలి విశ్వాసమగు బాలార్క ప్రతిభలుకూడ కొనలు సాగినవి. అది చదివినప్పుడు మన హృదయము తేలికయనిపించును. కౌటిల్యుని అర్థశాస్త్రము లోకోత్తరగ్రంథము. సందేహములేదు. కానియది చదువునప్పుడు మనము సముద్రగర్భము నందున్నట్లు బెగడుపడుదుము. ఉక్కిరి బిక్కిరి యగుదుము. నిశ్చేష్టులమగుదుము. భయాక్రాంతులమగుదుము. ముద్రారాక్షసనాటకమునందు శత్రుంతపుడైన చాణక్యుని మ్రోలసగము చచ్చినిలిచిన చందనదాస

వర్తకునివలె గజగజలాడుదుము. ఈరెండుకథనములకును పూర్వరంగమైనపరిస్థితులే యీ గ్రంథములిట్లు దిద్దియుండును. కౌటిల్యుడు ప్రమాదపరిస్థితులలో నొకమహా సామ్రాజ్యమును నిర్మించుటకు అధ్వర్యుడయ్యెను. శ్రీకృష్ణదేవరాయల మీద అంత భారము లేకుండెను. సామ్రాజ్యము ఏనాడో స్థాపింపబడెను కాని దుర్బలహస్తములలో పడి యది శైథిల్యమునందు చుండెను. దాని నుద్ధరించి స్థిరీకరించుట యాతని భారము, ఈ రాజకీయ పరిస్థితులే దండనీతియందు వారిభిన్న దృక్పథములకు మూలమని భావింపవలెను.

రాజనీతిపై రాయలు వ్యక్తపఱచిన భావములను అధ్యయన సౌకర్యమునకై పది విభాగములు చేయవచ్చును. 1. నృపుడు, 2. అమాత్యులు, 3. ఉద్యోగులు-భృత్యులు. 4. రాష్ట్రము-ప్రజలు, 5. దుర్గములు-విప్రులు, 6. అడవులు-అటవికులు, 7. శత్రువు, 8 ఆయము-వ్యయము, 9. వాణిజ్యము-విదేశవ్యాపారము 10. నృపధర్మ సమన్వయము

కృష్ణరాయలు ఆకాలపు భావముల కనుగుణముగనే 'రాజు నిరంకుశుడు' అను విశ్వాసము కలవాడు ఈ నిరంకుశత్వము నృశంసమైనదికాదు. అనుకంపాసహిత నిరంకుశత్వము (Benevolent Despotism) రాయలనీతి సారాంశమీ పద్యములో నిముడ్చబడినట్లు తోచును.

'ఏపట్టున విడువక ర
క్షాపరుఁడవుగమ్ము ప్రజలచక్కి విపన్న
ర్గీ పెట్టినవిని తీర్పుము
కాపురుషులమీద నిడకు కార్యభరంబుల్'

ప్రజలను సర్వదా కాపాడుము, ఆర్తుల యార్తిని తొలగింపుము. అవినీతిపరులైన యుద్యోగులపై కార్యభారము నుంచకుము. ప్రభుత్వ తంత్రమున కంతకు నృపుడు కీలకముగావున అతడెల్లప్పుడును ఆత్మరక్షణ చేసికొనుచుండవలెను. ఈ యంశమునే ఖాండిక్య కేశిధ్వజ సంవాదములో సూచించినాడు. "స్వామ్యమాత్య సుహృత్కోశ జనపదములు-స్వామి (రాజు) క్షేమముగా నున్నప్పుడే వర్ధిల్లును,

అంగిసుఖముగా నుండినగదా సంగములు సుఖించుట', రాజులకు ప్రజారక్షణము శత్రుజయము, ధనోన్నతి సాధించుట, ముఖ్యధర్మములని యచ్చటనే పలికించినాడు భూపతి శాసనము అప్రతిహతమై యుండవలెను. అతని యాజ్ఞకెల్ల వారును తల్లడిల్ల వలదాయని ప్రశ్నరూపమున సూచించెను. రాజు చండశాసనుడుగా నుండుటయావశ్యక మైనను అతడు ఉగ్రదండ పరతంత్రుడు కారాదు. అట్లుచేసినచో ప్రజలు ఉద్వేజనము నొందుదురు. నృపుడు పరిపాలనా భారమును తానొక్కడై పూనజాలడు. కావున ఉత్తములయిన యమాత్యులను గూర్చికొనవలెను. ఈ యంశమును కౌటిల్యుడిట్లు ప్రతిపాదించెను. 'రాజత్వము సహాయసాధ్యము, ఒకచక్ర మెన్నడును నడువ నేరదు గదా ; కావున రాజు సచివుల నిడుకొని వారిమతము ననుసరించి ప్రవర్తింపవలెను.' రాయలు దీనినామోదించినవాడే. అమాత్యుల విషయము ముందు చర్చింతము. బండారమును, అశ్వగజరథాదులగు యుద్ధాంగములను తనయందే యుంచుకొని యెఱుకగలవాడును శూరుడునై ప్రవర్తింపవలెను. యుద్ధాంగములు దుర్మంత్రి యధీనములగుచో రాజు వానిచేతిలోని కీలుబొమ్మయగును. బహిరంతర శత్రువులపై కన్నుగలిగి యుండవలెను. వెలుపలి శత్రువుతో స్నేహము చేసియైనను ముందు తన రాష్ట్రమును స్థిరముగ చేసికొని రాజ్యములోని కంటకశోధనము చేయవలెను. రాజు భోగము లనుభవించుచునే అప్రమత్తుడై యుండవలెను.

'కన్నొకటి నిద్రవోc జెలికంట జాగ
రంబుగావించు భూమహాగ్రంబు మీcది
యచ్ఛభల్లంబుగతి భోగమనుభవించు
నెడను బహిరంతరములపై దృష్టివలయు'

నృపుడు పరిహరింప వలసిన దోషములిట్లు చూపబడినవి. ప్రజలు నొచ్చునట్లు ధనము రాబట్టుట, దండపారుష్యము, పందలతో మంత్రాలోచన చేయుట, వైరి రాజులు తన భూమిని కొంత యాక్రమింపగా పోనిమ్మని యుపేక్షవహించుట, తనకిదివరలో మేలుచేసిన వారిపై అవిశ్వాసముతో నుండుట-మున్నగు దోషములను రాజు తనయందు లేకుండునట్లును జాగరూకత వహింపవలెను. నృపుని దినచర్యనుగూర్చి గూడ సముచిత వివరము లీయబడినవి. ప్రత్యూషమునందే సౌఖశాయనికుల కళల ప్రశ్నలతో మేల్కాంచి భిషగ్వరులతో, కార్తాంతికులతో, గోష్ఠిసలిపి జాముప్రొద్దెక్కిన పిమ్మట అమాత్యులు, సామంతులు, అర్థార్జన నియుక్తులైన కాయస్థులు మున్నగు

వారితో మంతనమాడవలెను. దినమధ్యమున అంగమర్దనము చేయుమల్లులను, సూద కులను' వేటకాండ్రను పలుకరింప దగును. అపరాహ్ణమున దేవతార్చనతీర్చి, ఆన్య ధర్మాధికృతులైన యతులను సంభావించి భుక్తి చేయవలెను. అటుపిదట విద్వాష కుల హాస్యములు వినుచు పురాణ కవిత్వ గోష్ఠి నిర్వహింపవలెను. సంజెవేళ చారు లనువిచారించి, సంగీతమవధరించుట, అర్ధరాత్రి పేరియసి గోష్ఠిపూర్వకముగ సుషుప్తి. రాజుతన యారోగ్యమువట్ల ప్రత్యేకశ్రద్ధ వహించవలెనని రాయలహితవు. 'సాంగ రాజ్యమొకయెత్తు, స్వాంగరాజ్య మొకయెత్తుగ నాయుష్యపరత నృపతి మెలగ వలెను. 'నృపభోజనము వివిధ షాడబలములతో గూడియుండును గాన అపరాహ్ణమున శుద్ధకోష్ఠమున భుజించవలెనని రాయలసూచన. నృపుడు త్రివర్గములను సమముగా భజించువాడైనను, ధర్మమువైపు మొగ్గుచూపిన ప్రశంసనీయము.

వినవర్గ సమత నృపుడు
న్ననుధర్మాంశంబె హెచ్చెనా పెఱమడికె
త్తిన నీరును దెగి యలరా
జనపుమడికి నెక్కినట్లు చనుముదమందన్.

కౌటిల్యుని మతమును దీని కనుకూలముగనే యున్నది. వినయాధికారము నందాతడు ఇట్లు చెప్పెను. "ధర్మార్థ విరోధముగా కామమును సేవింప వలెనుగాని సుఖరహితుడు కాకూడదు. అన్యోన్యానుబంధముగల త్రివర్గమును సమముగ సేవింప వలెను_"

## 2. అమాత్యులు :

రాజ్యాంగ విధానమునందు నృపుని తరువాత అమాత్యునిదే ప్రాముఖ్యము, కౌటిల్యుడు అమాత్యులను మంత్రులను వేరుగా పరిగణించెను. ఎక్కువ బాధ్యతలు కలవారిని మంత్రులుగను. సామాన్య బాధ్యతలుగల వారిని యమాత్యులుగను అతడు యేర్పరచెను. మంత్రులు ముగ్గురు నలుగురే యుండదగుననియు అమాత్యులు పెక్కుండుర్రి కావచ్చుననియు నతని సూత్రము, ఇదియొక విధముగ ఈనాటి Cabi- net Ministers-State Ministers వ్యవస్థవంటిదిగాతోచును.కృష్ణదేవరాయల

కాలమున ఈ భేదముండెనో లేదో తెలియరాదు. అమాత్యలక్షణములుగా రాయలు పేర్కొన్న గుణములు 'శాస్త్రాదులను పఠించి, అధర్మభీరులై, రాజనీతి పరిజ్ఞానము కలిగి, వయస్సు డెబ్బదికి లోపును ఏబదికి పైబడియు నుండి, నీరోగుడై, కాలక్రమ గతముగ వదవియందుండి మాత్సర్యాదులు లేక, రాజప్రార్థనచే అమాత్యత్వము స్వీకరించు విప్రుడు లభించినచో రాజ్యాంగములు (సప్తాంగములు) అభివృద్ధి నొందుటకు ఒకపూట చాలదా? అని సంప్రశ్నము. ఇట్టి యమాత్య వర్యుడు లభింప నిచో భూపతి తన పరిపాలనా కార్యమును స్వయముగ నిర్వహించుకొనుట మేలు. అంతియేకాని గుణహీనుని మంత్రియని నెత్తినపెట్టుకొన్నచో వాడు గుమ్మడికాయంత ముత్యమై భరింప యోగ్యుడు గాకుండును. దుష్టసచివులను గూర్చి రాయలు విశేష ముగ హెచ్చరికలు తెల్పెను. దుస్సచివుల కృత్యములిట్లుండును. 'పరరాజ్యమందలి శత్రువులను ప్రోత్సహించి, ఆత్మదేశమునందలి దస్యులు, దొంగలు మున్నగు వారిని కూడగట్టుకొని, దుస్సాహసము కలవారై తమకృత్యములను అలక్ష్యముచేసి రాజును చిక్కులలో పడవైచి, ఆ యాపదలనుండి యుద్ధరించుటకు తామెగతి యగు నట్లు అల్లుకొని పోవుదురు. వలయు వస్తువులను అధికారమును తమ యాశ్రితులకే యిప్పింతురు. రాజుచెడ్డవాడని యపకీర్తి కలిగించుటకై తమవశము కానివారికి రాజుచే వాగ్దానములు చేయించి యవి చెల్లకుండునట్లు చేయుదురు. ఇట్టి దుర్మంత్రు లకు ఔషధమేమన విశ్వాస పాత్రులయిన ఇతర సచివులను నియమించుకొనుటయే. జఠరాగ్ని మందగించినప్పుడు వెలియౌషధములు దానికి దీప్తి కలిగించినట్లే సమర్థ డైన మంత్రి దుస్సచివులయాట కట్టించును.

## 3. ఉద్యోగులు-భటులు:

రాజు బలగము సహాయములేక యేపనియు చేయజాలడనుట తెల్లము. రాయలిట్లు పలుకుచున్నాడు. 'ధనముఖ్యము ఏపనికినిచెల్లదు, అనగా ధనమేపనులను సాధించదు. రాజకార్యములందాస్థగలిగినగొప్పయుద్యోగస్తులు పనిచేయక కార్యములు నమకూరవు. వారిని సమకూర్చుకొనుట కుపాయములు- లోభము లేకుండుట. మంచి వేతనము లిచ్చుట, క్రౌర్యము లేకుండుట, ఋతము, (పలికి బొంకనితనము) భాండాగారము. గజతురగాది యుద్ధాంగము లన్నియు సమృద్ధిగానుండియు ననువగు నుద్యోగులు లభింపకపోవుటచే క్షీణదశకు పాల్పడి, శత్రువులకు లొంగిపోయిన సింహాసనములు పెక్కుకలవని రాయలు నుడివెను.

మదగజములు యుద్ధాశ్వములు మున్నగువానిని దొరలకీయరాదు. వానిని చక్కగా పోషించి దయతో చూచు భటునకే ఈయవలెను. రాజ్యమునందలి

పరుసదనము మేయనరగావఁ
ధారఁదగినది పొదుఁగుగోయు చొప్పగు, విను పా
ల్గురియించు కొవఁదలంచిన
వరయవలదెగోవుఁ బ్రజయుఁనధిపా.....

పులిగూనలఁదినుచందము
గలిగిన నంతటన నిలుచుగాక ధనంబుల్
గలుగునె మీఁదం గావున
జలగ దిగిచినట్లు గొనఁగఁజను విలసొమ్ముల్

రాయల యభిప్రాయములును ఇట్టివే యనుట తథ్యము.

## 5. దుర్గములు–విప్రులు :

దుర్గములను ఆప్తద్విజవర్గమునకే ఈయవలెను. అట్టి దుర్గాధిపతులు శత్రువుల దాడి నెదుర్కొన గలుగుటకు వలయు బలస్తోమము కొఱతపడకుండ సమకూర్పవలెను. దుర్గాధిపత్యము నందుంచబడిన ద్విజులు హితులును, బహుశ్రుతులును, ధర్మరతులును, శూరులును, వంశపారంపర్యముగా వచ్చువారు నైయుండవలెనని రాయలు తిరిగి వక్కాణించెను. పులిజున్ను మొదలుకొని అపూర్వములును, ఆవశ్యకములు అగు సమస్త పదార్థములను ఒక సంపూర్ణ పురుషజీవితమునకు చాలినంత విరివిలో ( అనగా నూరేండ్లకు సరిపడునవి ) దుర్గములందు సంసిద్ధము చేయవలెను. చీమకాలైనంత వాగ్దాన భంగముగాకుండ సామంతులకు భూముల నీయవలెను.

విప్రులైన యుద్యోగులందు రాయలు వ్యక్తపరచిన విశ్వాసము గమనార్హము. అమాత్యపదవియందు, దుర్గాధిపత్యమునందు బ్రాహ్మణులను నియోగించదగునను రాయలయభిప్రాయము స్వానుభవముపై నాధారపడినదని మనము భావింపదగును.

'హానిసంకటముల నిల్చుగావఁ దఱుచు
బ్రాహ్మణునిఁ బ్రభుజేయుట పతికి హితము'

అట్లని విప్రుడెట్టివాడైనను సమ్మానార్హుడను పామరభావము నాతడు పెట్టలేదు. గుణహీనుడు, అశ్రుతుడు, బొంకుపలుకువాడు, వైదేశికుడు, ఆతతాయి

యగు విప్రుని విడువుమని యుపదేశించినాడు. నాడీజంఘుడను బక శ్రేష్ఠుని జంపిన దుష్టబ్రాహ్మణుని వంటి కృతఘ్నుని ఏలరాదని శాసించెను. తన రాష్ట్రమున కుపద్రవము తెచ్చి పెట్టినవానిని విప్రుడైనను దునుమతగును. ఇంద్రుడు త్రిశీర్షుడను నాచార్యుని శిరస్సు దునుమలేదా !

## 6. ఆటవికులు_అడవులు:

దుర్గములైన పర్వతారణ్య ప్రదేశములందు నివసించుచు భూపీడనజేయు ఎఱుకులు మున్నగువారి బారుగూళ్ళను అస్యప్రాంతమునుండి జీవితము నిమిత్తము తన్నాశ్రయించిన శూరులకీయదగును అనగా అస్థిరులును దుస్సాహసము గలవారు నగు బోటరుల నిట్టి సంఘర్షణ స్థానములలో నిలుపవలెను. దానివలన రాజునకు మేలు, ఎఱుకులు – దుస్సాహసులైన వీరులు – ఇందులో నెవరు నశించినను లాభమేకదా. ఆటవికులు మున్నగు తెగుదారుల చిత్తవృత్తిని రాయలు బాగుగా గమనించెను. వారు అల్పులగుటచే సులభకోపులు, సులభసంతోషులు, కాని వారు సత్యప్రియులు. అడితప్పరు. కొంచెమవజ్ఞ కలిగినను కలుషింతురు. ఎంతటి పని కైనను వెనుదీయరు. కావున ఆటవికులను సత్యభాషణము చేతనే వశపరచుకొన వలెను. అల్పులైన మన్నెపు దొరలపై దోషదృష్టినుంచుట మట్టిగోడను కడిగి శుభ్రముచేయుటవంటిది. అది యెన్నటికి నిజమగునదికాదుగదా. వారిని సత్యప్రతి జ్ఞలచేతను, ఈవిచేతను, సంతోషపెట్టి చేరదీయవలెను. శత్రురాజులపై దాడికిని లేదా గడిదేశములు కొల్లపెట్టుటకును వారు పనికివత్తురు. నృపునకు శతాపరాధము సహస్ర దండము అతర్క్యములు.

అడవులను గూర్చి రాయలిట్లు చెప్పెను. 'గడిదేశముల సమీపపు టడవులను దట్టముగా పెంచుము. రాజ్యమధ్యమందలి యడవులను పొడిపొడిగా నరికింపుము. దానివలన దస్యుబాధ నశించును. తన రాజ్యమువందలి దొంగలగుంపును సంహ రించవలెను. అరక్షులగమి (రక్షకభటులు) లంచగొండులై దొంగలను అజ్ఞయిడక చోరుడు కారాగారమునుండి తప్పించుకొనగా సహించి, నిర్దోషియైన మరొకనిని వానిస్థానమందు నిర్బంధించగా అట్టి నిర్దోషిని రాజు శిక్షాపాత్రుని చేయుట అపయశ స్సునకును పాపమునకును గారణమగును. ఇది యెట్టిదనగా అవివేకియైన రాజు కోమటి పెద్దసెట్టిని పెద్దస్థూలకాయుడు గావున కొట్టునందు వేయించినట్లుండును'

## 7. శత్రువు:

అనాదినుండియు శత్రువిజయము నృపధర్మముగా పరిగణింపబడుచున్నది. అది కీర్తిహేతువగుచున్నది. 'యశసేవిజిగీషూణామ్' అన్నాడు కాళిదాసు. శత్రువులు రెండు విధములు. అంతశ్శత్రువులు. బహిశ్శత్రువులు, అరిషడ్వర్గమే నృపతికి అంతశ్శత్రువులు. వీనిని జయించక రాజు లోకమునెట్లు జయించును కౌటిల్యుడిట్లు చెప్పుచున్నాడు. 'కామముచే బ్రాహ్మణకన్యనుగోరి భోజవంశకుడగు దాండక్యుడును, కోపము వలన జనమేజయుడును, లోభముచే చాతుర్వర్ణ్యములనుండి యమితముగ ధనాహరణ చేసిన ఐలుడును, మదమువలన భూతావమానము గావించిన దంభోద్భవుండును, హర్షముచే నగస్త్యుని జంపదలచిన వాతాపియు, నశించిన విధమున శాస్త్రవిరుద్ధవృత్తిగలిగి అవశ్యేంద్రియుడైన రాజు చతుర్దిగంతములకును పతియైనను తక్షణము నశించుచున్నాడు' బయటి శత్రువులను జయింపబూనుటకు ముందు నృపుడు ఆత్మశత్రువులైన కామాదులను జయింపవలెనని మహాభారతము నుడువుచున్నది.

బహిశ్శత్రువులు తిరిగి రెండువిధములు. అంతరరివర్గము మొదటిది. తన రాజ్యమునందేయుండి యపకారము తలపెట్టువర్గము. రెండవది రాష్ట్రము వెలుపలి శత్రువులు, శత్రురాజ్యములు. అంతరరివర్గ విషయమై రాయల యనుశాసనమిది. రైతు తన పొలము అవరణను స్థిరపరచుకొని, దానికి కంచెవైచి, గొడ్డలితో త్రవ్వి వేరు వెల్లంకి తొలగించునట్లు. ఉపాయశాలియైన రాజు శత్రువుతో స్నేహముచేసి కొనియైన మున్ముందు తనరాజ్యములోని కంటకశోధన చేయవలెను. చారవర్గముచే కంటకవర్గమును కనిపెట్టవలెను. శత్రువునందైనను హింసదగదు. జయించిన మీదట దయచూపినచో వాడును నమ్మును. శత్రురాజునకు సగమురాజ్యమిచ్చియైనను సరే అహిభయమువంటి అరిభయమును (స్వపక్ష శత్రువులు) మాన్పుకోవలెను.

ఇంక వైరిరాజ్యములయెడ వర్తింపవలసిన విధము. గడినృపుల రాయబారులతో రాజు తియ్యగ మాట్లాడవలెను. వారిని బహూకరించుచుండవలెను. శత్రువుల విషయమున రాజు ఎలపాది కారాదు, ప్రతిన(నిర్మూలించుటకు) పట్టరాదు ఒక్కొక్కప్పుడు దండువెడలక తీరదు. వెడలినను కార్యము సమాప్తము కాకపోవచ్చును సంధియొనర్పవలసి వచ్చును. 'కార్యకాఁడౌ' 'యంకకాడౌ' నృపుండు అని రాయలు హెచ్చరించెను. నృపతి కార్యసాధకుడుగా మాత్రమే యుండవలెను. అదనువేచియే

వివేకియైన రాజు శత్రువులపై విక్రమింపవలెను. వైరిరాజ్యము క్షీణశక్తియైయున్న వార్త చారులవలన నెఱిగి హఠాత్తుగా కొంగ చేపనుబట్టి మ్రింగినట్లు కబళించి, తన ప్రజలకును తనకును ఒడలు దుమ్ముకాకుండ పరరాజ్యము నాక్రమింపవలెను. రాజు వేళోద్రిక్తుడు మాత్రమే కావలెనని, ఖాండిక్యకేశిధ్వజ సంవాదమునందును ప్రతిపాదింపబడినది. దండుపెడల నిశ్చయించినచో లఘుప్రమాణములతో రిపుదేశము వైపు నడుపవలెను. తన సైన్యములు వెన్నంటివచ్చు వఱకు ఆగుచుండవలెను. కొత్తనీరు వచ్చువఱకు పాతనీరు ఆగినట్లు చారులను ప్రయోగించి శత్రు రాజు బలసొందుఁడని తెలిసినచో యుద్ధమునకు దిగక కానుకలంది మరలపోవలెను. వైరి దుర్బలుడని తెలిసినచో మరలిపోక వానినావరింపవలెను. శత్రుసైన్యమును. ఇరకాటమునందుపెట్టి యుద్ధముచేయరాదు. అట్లయినచోవారు తెంపుచేసి ప్రాణములకు తెగిపోరుదురు. దాన దాడిచేయునప్పటికిని ప్రమాదము కలుగవచ్చును. శత్రు రాయబారులతో పరుషములు పలుకరాదని రాయలహితవు. ఒకప్పుడు సంధికే ఒడబడవలసి వచ్చునేమో, శ్రీకృష్ణదేవరాయలు చెప్పిన మఱికొన్ని మాటలు స్వర్ణాక్షరములలో వ్రాయదగియున్నవి. వైరిరాజ్యమును దుర్గములను పట్టుకొనుము. అవసరమయినచో హరించుము. కాని శత్రుస్త్రీలు చేజిక్కినచో వారిని పుట్టినింటి యాండ్రవలె నాదరించుము. 'తదవరోధమగుపడ్డ పుట్టినింటి యాడ్రనడపు' ఈగొప్ప సత్యమును అళియరామరాయలు గుర్తించక వైరికాంతల నవమానపరచి శాశ్వత శత్రుత్వమును తెచ్చుకొనెనని చెప్పుదురు.

## 8. ఆయము-వ్యయము

రాష్ట్రముల ఆదాయసాధనములెవ్వియో రాయలు సూచింపలేదు. ముందునుండి ఉన్నమార్గములనే యాతడు మన్నించియుండును. వార్తయే రాష్ట్రమునకు ముఖ్య వాహికయై యుండును. కృషి, పాశుపాల్యము, వాణిజ్యము-ఇవి 'వార్త' యనబడు నని కౌటిల్యుడు. సామంతులు చెల్లించు కప్పములుగూడ ఆదాయసాధనములుగ నుండియుండును. అర్థశాస్త్రమునందు 'సమాహర్తృ సముదయ ప్రస్థాపనము' అను నధ్యాయమున ఆయవ్యయ శరీరము వివరములతో వర్ణించబడియున్నది. 'దుర్గ, రాష్ట్ర, ఖని, సేతు, వ్రజ, వణిక్పథములు' ఇవియే ఆయన శరీరమని సూత్రిత మైనది. వ్యయము విషయమున శ్రీకృష్ణదేవరాయలు సూచించిన విధానము ప్రశంస నీయమైనది. రాష్ట్రాదాయమును నాల్గుభాగములుచేసి అందు ఒకపాలు నృపుని సొంత ఖర్చునకును, భూరిదానములకును రెండుపాళ్ళు భయదసేనా పరిపోషణమునకును

వినియోగింపవలెననియు, ఇంక మిగిలిన ఒకపాలు కోశాగారమునందు నిలువయుండ వలెననియు రాయలమతము. ఇది క్షేమనిధివంటిది. లోటు బడ్జెట్టు, అభివృద్ధి బడ్జెట్టు అను సూత్రము ప్రాచీనులంగీకరింపలేదు. మరియు రాయలిట్లు పలికెను. "ఆదాయాధిక వ్యయాధికంబును బ్రజావిరుద్ధంబునుగా బంధరువుగూర్చి, వ్యయము ఆయమునకు తగ్గియే ఉండవలెనని శాసనము. ఏనుగులును, గుఱ్ఱములు కొనుట కును, వాటిమేతకగు ఖర్చును, భటులవేతనములకును, దేవబ్రాహ్మణ పూజలకును ఉచితమైప స్వకీయ భోగమునకును అగువ్యయము, దుర్వ్యయము కారాదని రాయలు వివరించెను.

## 9. విదేశ వ్యాపారము :

విజయనగర సామ్రాజ్య వైభవమునకు ముఖ్యహేతువులలో నొకటి విదేశ వ్యాపారసరణియని విజ్ఞులు చెప్పుచున్నారు. మహావివేకియైన కృష్ణదేవరాయలీ విషయమున ప్రత్యేక శ్రద్ధవహించెననుట ప్రశంస తోవకానేరదు.

"రేపుల్ మాపు మతంగజంబులు మణి శ్రీఖండ ముక్తాదియుక్
రా, వాణిజ్యము పెంచి యేలఁ గనఁగా స్వర్ణంపు నెవ్వన్, రుజన్,
హావళ్ళం దిగు నన్య భూప్రజల రాజాయాయి జాత్యౌచితిన్
బ్రోవంగాఁదగుఁ దోటఁ దొడ్డి, గను లాప్తుల్ చూడఁ బంపన్ దగున్."

గుఱ్ఱములు ఏనుగులు మాణిక్యాదులు వచ్చునట్లుగా రేవుల నభివృద్ధి చేసి వాణిజ్యము పెంపవలెను. వర్షాభావముచేతను, రోగములచేతను, ఇతర ఉపద్రవ ములచేతను స్వదేశము వీడి తన రాజ్యమున ఆశ్రయము కోరివచ్చిన అన్యరాజ్య ప్రజలను రాజు ఆదరించి వారికాయా జాత్యౌచిత్యము మేరకు వృత్తులీయవలెను. మరి యొకచోట నిట్లు చెప్పినాడు. "ఏనుగులను, గుఱ్ఱములు దిగుమతిచేయు దూరపు దీవుల వణిజులకు ఊళ్ళను. రాజధాని నగరమునందు సద్గృహములను, ఆదర పూర్వకమైన కొలువును రాజులొసంగవలెను. ఆ వస్తువులను శత్రురాజులకంటె అధిక మూల్యమిచ్చి తన సొమ్ముగా చేసికొనవలెను. అనగా విదేశ వర్తకుల మన్ననలను వారి కిష్టాయతిధరకు కొనవలెను. అట్లు వారు తనపాత్రమిత్రులుగా నుండునట్లును, గజాశ్వాదులు శత్రురాజ్యము చేరకుండునట్లును వ్యవహరింపవలెను.

## 10. నృప ధర్మ సమర్థనము:

వేయికన్నులు పెట్టుకొని రాజ్యమేలినను నృపతికి మెప్పులేదుగదా; దండమును ధరించు నావెతయేల? అని యనరాదు లోకతంత్ర నిర్వాహణమంతయు దండాధీనము. రాజులేని రాజ్య మనూహ్యమని ప్రాచీనుల మతము. శాంతిపర్వమిట్లు చెప్పును.

"లోకములు లోకధర్మంబులును నృపాల ;
రాజమూలముల్, రాజవిరహితమైన
పుడమి జనులకు నింకిన మడువులోని
జలచరంబులు పడుపాట్లు సంభవిల్లు ;"

అయినను 'రాజ్యాంతే నరకంధ్రువ' మ్మను వాక్యమున్నదికదా. రాజ్యము చేయుచు పాపము చేయకుండుటెట్లు? అని నృపధర్మవిముఖులు కారాదని శ్రీకృష్ణదేవరాయల నిశ్చితాభిప్రాయము. దీని నాతడిట్లు సమర్థించెను. "ఆమ్నాయము శక్త్యానుసారము ధర్మ నిర్వహణ మొనర్పుమని శాసించును. అశక్త్యానుష్ఠేయము విధింపదు. మనుదండధరాదులు విశేషించి దోషంబెఱింగి దండించియే ధర్మపరులనబరగిరి. పూర్వకాలపు మహారాజులకు గల్గిన అతీంద్రియ శక్తులు ఈనాటి రాజులకులేవని కించపడనక్కరలేదు. ఇట్టి ప్రజ్ఞాక్షయము క్షత్రియులందేకాదు ఈనాటి విప్రులయందును చూపట్టును. ఒక్కబొడబుండు కడలినీరు గ్రుక్కంగొనియె. అట్టి శక్తిలేదని ఈనాటి భూసురులకు స్వధర్మానుష్ఠాన మేమరవచ్చునే? కావున భూపతి సావధానుండై ఋత్రత దృష్టంబులుపేక్షింపక రక్షణంబు లొనర్చుచు అశక్యంబునకు పుండరీకాక్షునిమీద భారంబిడి యనహంకృతిఁ బ్రవర్తిల్లవలయును".

# శ్రీ దేవులపల్లి రామానుజరావు

## 'గ్రామాలలోని వేడుకలు; క్రీడా వినోదాలు'

గౌతమీ కృష్ణవేణులకు అవాసమై పాడిపంటలకు నిలయమైన తెలుగు సీమలోని పల్లెపట్టులలో కళాసౌందర్యము అడుగడుగున గోచరిస్తున్నది. తెలుగువారి భాష యెంత మధురమైనదో, వారి సామాజిక జీవనమంత సుందరమైనదనియు చెప్పితే అతిశయోక్తి అవంతయునుగాదు. భారతదేశ మంతటిలో నున్నట్లే తెలుగుసీమలో గూడ నూటికి తొంబదిపాళ్ళ జనులు పల్లెటూళ్ళలో నివసిస్తున్నారు. ఈపల్లెటూళ్ళలో తరతరాలనుండి వ్యాప్తిలోనున్న వేడుకలు, క్రీడా వినోదాలు యెన్నియో కలవు. ఈ క్రీడా వినోదాలలో తెలుగువారి సుకుమార అభిరుచి ప్రతిబింబిస్తున్నది.

స్త్రీలకు, పురుషులకు, బాల బాలికలకు ప్రత్యేకంగా కొన్ని వినోదాలు, ఆటపాటలు వున్నవి. వీనితోపాటు స్త్రీ పురుషులకు సమానముగా ఆదరణీయములైన వినోదాలు క్రీడలుకూడ కొన్నికలవు. ఈ క్రీడలలోను, ఈ వినోదాలలోను, తెలుగు ప్రజల స్వభావగుణమైన సౌందర్యరక్తి మనకు స్పష్టంగా కనుపిస్తుంది. ఇందులో కొన్నివిశ్రాంతి సమయాలలో ఆటవిడుపుకొరకు ఉద్దేశించిన క్రీడావినోదాలు; మరికొన్ని పండుగపబ్బాలలో సర్వజనులు సమానముగా ప్రోత్సహించి, ఆనందించే వినోదాలు: ఇంకొకకొన్ని పెండ్లిండ్లు మొదలైన శుభకార్యాల సందర్భాలలో నిర్వహించే వేడుకలు: కొన్ని క్రీడలు, వినోదాలు శ్రీమంతులకు మాత్రమే అందుబాటులో నుండునవి. వేరొక కొన్నికొన్ని క్రీడలు సార్వజనికమైనవి—అన్ని తరగతుల ప్రజలకు అందుబాటులో నుండునవి. ఈవిధంగా జనుల ఆర్థిక స్థితిని అనుసరించి, వయస్సును అనుసరించి మనోరంజనము గావించు క్రీడలు, వినోదాలు తెలుగుసీమలో పుష్కలంగా వున్నవి.

ఈ వినోదాలలోను, వేడుకలలోను, పాటలను మొట్టమొదట పేర్కొనవలసి వుంటుంది. పొలములో కలుపుదీసే పడుచులు, ఎద్దులనుగాసే బాలకులు, సంపన్నుల యిండ్లలో కావలసినంత తీరికవున్న స్త్రీలు, బాలికలు, ఈ పాటలను పాడుతూ వుంటారు. పూర్వకాలంలో తుమ్మెదపదాలు, పర్వతపదాలు, శంకరపదాలు, నివాళి

పదాలు మనదేశములో అధికవ్యాప్తిలో వున్నట్లు తెలుస్తున్నది. కాని యీనాడు యీ పాటలు యించుమించుగా నశించినవనే చెప్పవలసి వున్నది. సేద్యముచేస్తూ కూలీలు పాడే జాజరపాటలు యీనాటికిని కొన్ని ప్రాంతాలలో విశేష వ్యాప్తిలో వున్నవి. హైదరాబాదు నగరానికి నూరుమైళ్ళలోనున్న వరంగల్ జిల్లా మానుకోట తాలూకాలో యీ పాటలను రైతు యువకులు మక్కువతో యీనాటికీ పాడుకుంటున్నారు. ప్రత్యేకంగా స్త్రీలు పాడుకొనే పాటలు గూడ యెన్నో వున్నవి. ఇందులో పెండ్లిపాటలు, కూతురిని అత్తమామలకు అప్పగించే సందర్భంలో పాడే అప్పగింత పాటలు, మంగళహారతులు, ముఖ్యంగా పేర్కొనదగివున్నవి. తెల్లవారకముందే లేచి, మేలుకొలుపులు ఆలపించే అలవాటు, యీనాటికిని మన పల్లెటూళ్లలోని పూర్వపద్ధతి కుటుంబాలలో కనుపిస్తున్నది. మనపిల్లలను ఉయ్యాలలో నిద్రబుచ్చుట కొరకు పాడే జోలపాటలను, మన దేశంలో విననివారు ఉండరని చెప్పవచ్చును. ఈ విధంగా వివిధములైన పాటలు, వివిధ సందర్భాలలో మన పల్లెటూళ్ళలో వీనులకు విందు జేస్తుంటవి

ఆటలకూ పాటలకు వీడరాని చుట్టరికమున్నది. తెలుగు పల్లెలలో రకరకాలైన ఆటలను మనము చూడవచ్చును. ఈ ఆటలు. మనస్సుకు ఉల్లాసము కలిగించే వేడుకలు, అందులో సమస్త జనులకు ఆకర్షించే తోలుబొమ్మలాట సుప్రసిద్ధమైనది ఈ తోలుబొమ్మలాట తెలుగువారి ప్రత్యేకత. వారు అనేక సంవత్సరాల నుండి ఉపాసించిన కళ. ఒక సన్నని బట్టను తెరగాగట్టి ఆ తెరవెనుక పెద్ద దివిటీలు వెలిగింతురు. తెరవెనుక తోలుబొమ్మల కాళ్ళకూ, చేతులకూ, దారాలు గట్టి బొమ్మలను నిలబెట్టి దారాలను లాగుతూ దివిటీల వెలుగులో వానిని ఆడింతురు. ఈ ఆటను ఆడించే నిపుణులైనవారు కొందరు, మన పల్లెటూళ్ళలో తిరుగుతూ వుంటారు. ఈ తోలుబొమ్మలాటలు ఎక్కువగా రామాయణ భారత కథలకు సంబంధించినవి. నిజానికి రామాయణమూ, భారతమూ, మన దేశీయులలో ప్రతిరక్తకణమునందును జీర్ణించిన కథలు. ఈ తోలుబొమ్మలాటలు ఉపయోగించే హాస్యము అప్పుడప్పుడు కొంత హద్దుమీరుతూ, కొంత అసభ్యంగావుండే ఘట్టాలుగూడ మనకు కనుపించును.

ఈ తోలుబొమ్మలాట వలెనే బహుళ ప్రచారము పొందినవి యక్షగానాలు అనే వీధినాటకాలు. ఈ నాటకాలను ఆడేవారిని జక్కులు అని పిలుస్తుంటారు. భాగవతములోని కృష్ణలీలలు మొదలైన వానిని ఆడేవారిని భాగోతులని గూడ పిలుస్తుంటారు. కొన్ని సంవత్సరాల క్రిందటి వరకు మన పల్లెటూళ్లలో ఈ భాగోతుల ఆటలు విరివిగా జరుగుతూ వుండేవి. ఎన్నోనూర్ల సంవత్సరాలనించి యక్షగానాలు, తోలు

బొమ్మలాటలతో పాటు, భాగోతాలు మన పల్లెటూళ్ల ప్రజలను రంజింపజేస్తున్న వినోదాలు, వేడుకలు. ఇవన్నీ తెలుగువారి కళాభిరుచికి మంచి నిదర్శనాలు భజన మండలులను స్థాపించి, వారానికొకసారి (యే శనివారమునాటి సాయంత్రమో) ప్రజలొకచోట సమావేశమై భజనలు గావించుట మన పల్లెటూళ్ల లోని వినోదాలలో ఒక ప్రత్యేకమైన వినోదము, ఇతరులు ఆడుతుండగా చూచి వినోదించే ఆటపాటలలోచేరే వినోదాలు బొబ్బిలికథ, బాలనాగమ్మకథ మొదలైనవి. ఈ కథలను చెప్పేవారు గంటలతరబడి, ఒక్కొక్కసారి పొద్దంతా. పల్లెటూరి ప్రజలనుఆకర్షించి వినోదింప జేస్తుంటారు. కాని ఈనాటి మారిన పరిస్థితులలో వీటికన్నిటికీ వ్యాప్తి తగ్గిపోతున్నది. ఈ కథలను జెప్పేవారి నేర్పు చాలాగొప్పది: వినేవారి రక్తము ఉడుకెత్తునట్లుగా వీరగాథలను వీరు చెప్పుచుందురు.

స్వయంగా పాల్గొని ఆనందించే ఆటలు, పాటలు. మన పల్లెటూళ్ళలో చాలా కనుపిస్తున్నవి. రంకురాట్నము, ఈ విధమైన వేడుకలలో ఒకటి. జనులు ఈ రంకురాట్నము నెక్కి గిర్రున తిరుగుట అందరికీ బాగా తెలిసిన వినోదమే. హైదరాబాదునగరంలో ప్రతి సంవత్సరము జరిగే అఖిలభారత ప్రదర్శనపు ఆవరణలోపల ఈ వినోదాన్ని చూడవచ్చును. మన పల్లెటూళ్లకు ప్రత్యేకమైనది గిల్లీదండ అనే ఆట. ఈ ఆట చాల పురాతనమైనది. తెలంగాణపు పల్లెటూళ్లలో దీనిని చిర్రగోనె. అనికూడ అంటారు. మన కవులు వ్రాసిన పుస్తకాలలో ఈఆట మనోహరంగా వర్ణింపబడింది. పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రుడు ఈ ఆట ఆడినట్లు పేర్కొనబడింది. భారతంలో కౌరవ పాండవులు ఈ ఆటను ఆడినవారంటే, యిదియెంత పురాతనమైనదో తెలుస్తుంది. ఒక చిన్న కర్రముక్కను పెద్దకర్రతో కొట్టుతూ, ఈ ఆటను ఆడుతుంటారు. ఈ ఆటను క్రికెట్టుతో పోల్చవచ్చును. కొందరు దీనిని స్వదేశీ క్రికెటు అని మెచ్చుకోవడం కలదు. కోడి పందెములు తెలుగు దేశీయులు ప్రత్యేకంగా కొన్ని సంవత్సరాల క్రిందటి వరకు అభిమానించిన ఆట. ముఖ్యంగా సంక్రాంతి సందర్భములో. ఈ ఆటను అత్యంత ఆసక్తితో ఆడేవారు. ఈ ఆట గూడ పలనాటి వీరచరిత్రలో చక్కగా వర్ణింపబడింది, బొంగరాల ఆట మన గ్రామాలలో మిక్కిలి ప్రచారములోనున్న క్రీడ: పిల్లలకు ఈ ఆటలో మిక్కిలి ఆసక్తి ఇవన్నీ గృహాలవెలుపల బహిరంగ ప్రదేశాలలో ఆడే ఆటలు. ఈఆటలు జరుగుతూ వుంటే జనులు ఎంతో ఉత్సాహంతో వీనిని తిలకించుతుంటారు.

ఈ ఆటలతోపాటు కాలక్షేపము కొరకు, యిండ్లలో కూర్చుండి ఆడే ఆటలు ప్రత్యేకమైనవి కొన్ని వున్నవి. ఈ ఆటలలో చదరంగము మిక్కిలి ముఖ్యమైనది

కాక చాల ప్రసిద్ధిచెందినది. అసలు ఈఆట మొట్టమొదలు మనదేశములోనేప్రారంభ మైనదని కొందరు చెప్పుతుంటారు. ఏమైనప్పటికి, ఈ ఆటకు మన పల్లెటూళ్లలోని కుటుంబాలలో మంచి ప్రచారము వున్నది. ఈ ఆట ఆడటంలో కొందరు సాటిలేని నైపుణ్యము కలిగి వుంటారు. చదరంగము వంటి ఆట యింకొకటి వులిజూదము. మూడు రకాలుగా వున్నది. ఒక పటముమీద. చిన్నరాళ్లనో లేక చింతగింజలనో తీసికొని, కొన్నింటిని పులులుగాను, మరికొన్నింటిని మేకలుగాను భావించి, ఆడే ఆట యిది. పులులసంఖ్య మూడింటికన్న మించదు. మేకలసంఖ్య పదహారింటివరకు వుంటుంది. ఒకరు పులులను తీసికొని, యింకొకరు మేకలను తీసికొని ఈ ఆటను ఆడుచుందురు. ఇప్పుడు ప్రచారము తగ్గిపోయినా, యిటీవలవరకు, మన పల్లెటూళ్ల లోని ఉన్నత కుటుంబాలలో విశేష ఆసక్తితో ఆడిన ఆట పాచికల ఆట; దీనికి అక్షక్రీడ అని మరొక పేరు వున్నది. ఈ ఆటగూడ తరతరాలనుండి మనదేశము లోని ప్రజలను ఆకర్షించినది. మన ప్రబంధాలలో ఈ ఆటను రమణీయంగా మన కవులు వర్ణించినారు. రుక్మిణీ కృష్ణులు ఈ ఆటను ఆడినట్టు ఉత్తర హరివంశములో మనోహరముగా వర్ణించబడినది. ఈ తరగతికి చెందిన యింకొక ఆట పచ్చీసు. ఈ ఆటలో స్త్రీలకు ఆసక్తి ఎక్కువ రంగు గుడ్డతో అంగముగా పచ్చీసును కుట్టించి, దానిమీద పూసలతో యిండ్లను యేర్పాటుచేసి, గవ్వలను వేస్తూ ఈ ఆటను ఆడే దృశ్యము పల్లెటూళ్ళతో యే మాత్రము కొద్దిపరిచయము కలిగిన వారికైనా బాగా పరిచితమైనదే. ఈ ఆటలు మన గ్రామీణ సంస్కృతి శోభకు మంచి ప్రతిబింబాలు.

జనులను వినోదింప జేయడానికి ప్రత్యేకంగా ఉద్దేశించిన వేడుకలు యింకా యెన్నో మన పల్లెటూళ్ళలో చూడవచ్చును. వినోదాలే వృత్తిగా కలిగినవారు గూడ కొందరున్నారు. ప్రస్తుత పరిస్థితులలో ప్రోత్సాహము లేనందువలన జీవనోపాధి కొరకు వీరు యితర వృత్తులను అవలంబించడం చేత వీరి సంఖ్య తగ్గిపోతున్నది. బొబ్బిలి, బాలనాగమ్మ కథలు చెప్పేవారిని గూర్చి యింతకుముందే ప్రస్తావించినాను. గంగిరెద్దుల నలంకరించి, యిల్లిల్లు తిరిగేవారు ఈ శ్రేణికి చెందినవారే. పగటి వేషాలను వేసి, ప్రజలను వినోదింప జేసేవారు మనకు కనుపిస్తుంటారు. వీరిని పగటి వేషాల వారనీ, బహురూపుల వారని పిలుస్తుంటారు. విప్రవినోదులనే వారు గారడీవిద్యలో ప్రవీణులు. వీరు అనేక ఇంద్రజాల ప్రదర్శనలు చేస్తుంటారు. వీరందరూ జనుల పోషణ మీద ఆధారపడి ఈ పనులను వృత్తిగా తీసికొని అందులో గొప్ప నైపుణ్యం సంపాదించినటువంటి వారు.

పల్లెటూళ్ళలో ఉయ్యాల లూగుట బాలబాలికలే గాక పెద్దలుగూడ మిక్కిలి మక్కువ చూపించే క్రీడ. ఏదోవిధమైన ఉయ్యాలను మనము అనేక గృహాలలో చూడవచ్చును. ఈమధ్య యితర క్రీడవలెనే, సన్నగిల్లిపోతున్నప్పటికినీ గుర్రపుస్వారీ, మన గ్రామాలలో బాగుగా అభిమానించిన క్రీడ. మల్లయుద్ధాలు, కుస్తీలు మొదలైనవి తరతరాలనుండి మనవారు అభిమానించి, ప్రోత్సహించిన క్రీడలు. తెలుగు దేశంలోని జమీందార్లు యిందులో ప్రవీణులైన వారిని తమ ఆస్థానాలలోనికి చేరదీసి వారిని పోషించిరి దసరా పండుగ సందర్భాలలో ప్రజల సమక్షాన యీ మల్లయుద్ధ ప్రదర్శనాలు, కుస్తీలు జరిపించి, వారిని బహూకరించే ఆచారము యిటీవలివరకు మన పల్లెటూళ్ళలో వుండేది: కత్తిసాము, కట్టెసాములలో ప్రవీణులైన వారిని మన పల్లెటూళ్ళలో చూడవచ్చును

కొన్ని వేడుకలు, వినోదాలు, క్రీడలు ప్రత్యేకమైన సందర్భాలలో జరుగుతుంటవి. దసరా పండుగకు ముందు, తొమ్మిది దినాలు బాణసంచాలను కాల్చడం జనుప కట్టెలను కాల్చడం ఈ తరగతికి చెందిన వినోదము. పిల్లలు ఈ తొమ్మిది రోజులు ప్రతిరోజూ ఈ వేడుకను జరుపుకుంటూ ఆనందిస్తారు. హోళీపండుగ సందర్భంలో ఒకరిమీద మరొకరు రంగులు చల్లుకోవడం కూడ యిటువంటి వేడుకలే. ఏరువాక పున్నమ అనగా జ్యేష్ఠపున్నమ. రైతులకు మిక్కిలి సంతోషకరమైన పర్వము. ఆనాడు వారు తమ యెడ్లను కడిగి, వాటిని రంగురంగులతో అలంకరించి, తమ నాగళ్ళమీద ఎర్రమన్నుతోను, సున్నముతోను పట్టెలను వేసి, ఆ నాగళ్ళను బుజాలమీద వేసికొని యెడ్లతోపాటు ఊరేగి, పొలాలకు వెళ్ళి దుక్కిదున్ని ఆ సంవత్సరపు వ్యవసాయపు పనులను అత్యంత ఉత్సాహముతో ప్రారంభించుదురు శ్రీరామ నవమినాడు బండ్లనుగట్టుకొని ఊరేగుట పల్లెటూళ్లలో మనము గమనించే మరొక వేడుక, సంక్రాంతికి తీర్థాలకు వెళ్ళే ఆచారము తెలంగాణపు పల్లెటూళ్లలో ప్రజలకు మిక్కిలి ప్రేమపాత్రమైన వేడుక, బండ్లను గట్టుకొని తమతమ కుటుంబాలతో సంక్రాంతి నుండి శివరాత్రి మధ్య జరిగే ఈ జాతరలలో వీరు పాల్గొంటారు. ఇటువంటి జాతరలలో ప్రసిద్ధమైనవి కొరివిజాతర ఐనవోలు జాతర, మేడారముజాతర మొదలైనవి. ఈ జాతరలలో అసంఖ్యాకముగా జనులు పాల్గొంటారు. దేవాలయాలల్లో సీతాకల్యాణము మొదలైన ఉత్సవాలు జరిపించడం పల్లెటూరు ప్రజలకు అభిమానాస్పదమైన వేడుక, శక్తిపూజలు పల్లెటూరి ప్రజానీకములో చాల ప్రచారంలో వున్నవి. దుర్గ, కాళి, ఎల్లమ్మ మొదలైన దేవతలకు మేకపోతులను బలియిచ్చే వేడుక చాల ప్రసిద్ధమైనది.

ఈ విధంగా అన్నితరగతుల వారికి అభిమానాస్పదమైన వేడుకలు, వినోదాలు మన పల్లెటూళ్ళలో పుష్కలముగా వున్నవి. కొన్ని వినోదాలు, క్రీడలు స్త్రీలకు మాత్రమే ప్రత్యేకమైనవి. ఇందులో కోలాటము ముఖ్యంగా పేర్కొనదగినది. కాముని పున్నమకు ముందు వెన్నెల రాత్రిలలో యువతులు ఈ కోలాటము వేసే పద్ధతి తెలంగాణపు పల్లెటూళ్ళలో బాగా ప్రచారంలో వున్నది. పురుషులు గూడ కోలాటము వేయడం, ఆ సందర్భాలలో పాటలు పాడడం కొన్ని ప్రాంతాలలో కనుపిస్తుంది. అందుచేత దీనిని స్త్రీ పురుషులకు సమాన ఆదరణీయమైన క్రీడ యని కూడ చెప్పవచ్చును.

ప్రత్యేకంగా బాలికలు అభిమానించే ఆట చెమ్మచెక్క ఆట. తెలుగు సీమలో యే పల్లెటూరికి వెళ్ళినా చూడవచ్చును. అచ్చనగండ్ల ఆట మన పల్లెటూళ్ల బాలికలు అభిమానించే మరొక రమ్యమైన క్రీడ. కచ్చకాయలను ఎగురవేస్తూ, ఆడపిల్లలు ఈ ఆటను ఆడే దృశ్యము మిక్కిలి సుందరమైనది. ఓమన గుంటల ఆట ఆంధ్ర బాలికలకు, యువతులకు అభిమానాస్పదమైన క్రీడ. ఒక కొయ్యదిమ్మెలో పద్నాలుగు గుంటలు చెక్కించి, వాటిలో చింతగింతలు పోసి, ఈ ఆటను ఆడుతుంటారు. ఈ విధమైన కొయ్య దిమ్మెలు పల్లెటూళ్లకు వెళ్ళిచూస్తే అనేక కుటుంబాలలో కనుపిస్తుంటవి. గుజ్జనగూళ్ల ఆట గూడ బాలికలకు ప్రత్యేకమైనది రుక్మిణీదేవి చిన్నప్పుడు ఈ ఆటలను ఆడినట్లు భాగవతంలో పోతనగారు తెలిపినారు. బొమ్మరిండ్లలో గూర్చుండి బాలికలు గుజగుజలో రకరకాల వంటలు వండి వడ్డించినట్లుగా వినోదించే ఈ ఆట ఆడపిల్లలకు మిక్కిలి ప్రియమైనది. గీరన గింజల ఆట ఆంధ్ర బాలికలు అభిమానించే మరొక క్రీడా విశేషము. ముగ్గులు వేయడం పల్లెటూరి బాలికలకు, యువతులకు మిక్కిలి ఆహ్లాదకరమైన వేడుక. రకరకాల ముగ్గులను వేయడంలో నైపుణ్యము ప్రదర్శించే స్త్రీలు మన పల్లెటూళ్ళయందు పుష్కలముగా కనుపిస్తుంటారు. ఈ ముగ్గులు తెలుగు పడతుల సౌందర్యరక్తికీ, కళాభిరుచికీ, మేలి ఉదాహరణాలు. ఈనాడు యెక్కువగా వ్యాప్తిలో లేకపోయినా చిలుకలను పెంచి, వానికి బుద్ధులు చెప్పి వినోదించుట తెలుగు సీమలోని పల్లెటూళ్లయందలి సంపన్న గృహాలలోని సుందరాంగుల వేడుకలలో బహు రమ్యమైనది.

బతుకమ్మ పండుగ, బొడ్డెమ్మ పండుగ స్త్రీలకు ఆనందకరమైన క్రీడలు: వేడుకలు. ఈ రెండింటితోను వారు గౌరీదేవిని పూజించుదురు. మహాలయామ

వాస్యకు ముందుగా బొడ్డెమ్మలను, అమావాస్యనాటి నుండి బతుకమ్మను ఆడుట పల్లెటూళ్లలో ఆచారంగావున్నది. బొడ్డెమ్మను ఒక పీటమీద మన్నుతో నిర్మించుదురు. బతుకమ్మను తంగేడు పూవులతో, గుమ్మడి పూవులతో, గోరంట పూవులతో సుందరముగా కూర్చి పేర్చుతారు. సాయంకాలపు పూట బొడ్డెమ్మకు, బతుకమ్మకు చుట్టు బాలికలు. యువతులు, ముత్తైదువులు చేరి, పాటలు పాడుతూ వినోదిస్తుంటారు.

ఈ విధంగా మన పల్లెటూళ్ళ జీవితాన్ని పరిశీలించితే, క్రీడలకు. వినోదాలకు మనవారు యెంత ముఖ్యమైన స్థానాన్ని యిచ్చినారో వెల్లడి కాగలదు. క్రీడాభిరామమైన పల్లెటూరి జీవితములోని ఉత్తమ సంస్కృతిని ఈ క్రీడలు, వేడుకలు, వినోదాలు మనకు వెల్లడి జేస్తున్నవి.

(రేడియో ప్రసంగము - 1959)

# శ్రీ కొడవగంటి కుటుంబరావు

## 'నేనే కవినైతే'

నేనసలు కవి గావలసిన వాణ్ణే. కాస్తలో తప్పిపోయింది. సాహితీ సమితి ఇంచుమించు మా యింటిలోనే పుట్టి పెరిగింది. రోజూ నాకు కనుపిస్తూ, నన్ను పలకరించే శివశంకరశాస్త్రిగారూ, స్వామిగారూ, పూర్ణిమశర్మగారూ, బాబూరావుగారూ మొదలైన వాళ్లంతా నేను చూస్తుండగా కవితాగోష్ఠి చేసేవారు. నాకు దగ్గిర వాళ్లయిన మా అన్నగారూ, నోరి కూడా సాహితీ సమితిలోని వాళ్లేనాయె. వీళ్లమధ్య పెరిగిన నేను కవిని కాకపోవటమే ఆశ్చర్యం కాని, అయివుంటే ఆశ్చర్యం ఏమీలేదు. కవి తమ్ముళ్లయి ఉండి కవి కానివాళ్లు చాలా అరుదు. నేనా అరుదు మనుషుల్లో వాణ్ణి.

అయితే నేను కవిత్వం రాయటానికి ప్రయత్నించక పోలేదు. నాకు పదమూడో ఏడు వస్తుండగా కవి కావాలనే ఆవేదన కలిగింది. కవిత్వం రాయాలంటే ఏం చెయ్యాలని మా బంధు వొకాయన్ని అడిగాను. ఆయన నాకు "యమాతారాజభానస" అనే తారకమంత్రం ఉపదేశించి, దాని ప్రకారం గణాలు చూచుకోమన్నాడు. బుద్ధికి తట్టిన ప్రతి మాటకూ, పేరుకూ, గణాలు చూసుకుంటూ గణ సాధన చేశా, ఆరోజుల్లోనే స్వరసాధన చేసుకుంటూ ఉండటం నాకభ్యాసంగా వుండేది. ఆ చేత్తోనే గణ సాధనకూడా చేశాననుకోండి,

ఆ తరవాత సులక్షణసారం కొని ఆ సులక్షణసారం చదవనారంభించగానే నాకు కవిత్వం అంటే భయం ఆరంభమయింది. "యమాతారాజభానస" వట్టి ఓనమాలని నాకు తెలిసివచ్చింది. ఇన గణాలూ, ఇంద్ర గణాలూ, చంద్రగణాలు కాక లగమూ, గలమూ మొదలైనవి చూస్తుంటే నాకు తారెత్తింది. ఈ గుణిత్వమంతా సరిచూచుకునే కంటే హాయిగా చెవివిబట్టి రాసుకుంటేనే నయమనిపించింది. నాకప్పటికి ఫ్రీహాండు డ్రాయింగు అలవాటున్నది. ఆ పద్ధతినే ముందు స్థూలంగా పద్యాని కొక స్వరూపం ఇచ్చుకుని తరువాత neat line చేసుకోవచ్చు. మచ్చుకు చూడండి.

"కందము-నవ-నన-నవ-అర
విందము-వన నాన-వనవ-పీములలర ఆ
నందము-నాననా-మక
రందము నన-నాననన-రామ న[illegible]రా."

ఇట్లా outline తయారయినాక వకారాలు ఎత్తేసి అక్కడ మాటలు పెడితే అదే పద్యమవుతుంది. ఈ పద్ధతిని కొన్ని పద్యాలు రాసి ఒకసారి ప్రచురణార్థం పత్రిక్కి కూడా పంపాను. అదృష్టవశాత్తూ అవి అచ్చుకాలేదు. మంచిపనే అయింది. ఎందుచేతనంటే మరికొంత కాలానికి నాకే తెలిసి వచ్చింది-పద్యాలవీ నిజమైన కవిత్వం కాదని.

ఛందస్సే కవిత్వమైతే ఇకలేని దేమిటి? కాని అట్లాకాదు. అప్రయత్నంగా మనం నోటంట అనే మాటలు పద్య పాదాలవుతై. ఒక్కొక్క అదృష్టవంతుడి పేరు పద్యపాదం అయి ఊరుకుంటుంది. నన్నయ్యభట్టారకుడి వంటి మహాకవి "అనవిని యాతడిట్లనియె" అని వచనం రాస్తే అది పద్యంగా పరుగెత్తుతుంది. "పిలకా గణపతిశాస్త్రి" అన్నా "సోమయాజులు వేంకటరామమూర్తి" అన్నా పద్యపాదాలే. "కొరకరాని కొయ్య కొడవగంటి కుటుంబరావు" అని ఆరంభిస్తే అప్పుడే పద్యం నడుస్తున్నది. కాని ఇవి అంతా కవిత్వమా? ఒక్కనాటికీకాదు.

ఈ సంగతి గ్రహించగానే కవిత్వమంటే నాకు మరింత భయం వేసింది. కవిత్వం రాయాలంటే ఛందస్సుకాక ఇంకేదో ఉండాలి. అది వుంటే వచనం రాసినా కవిత్వమే అవుతుంది. చూడండి-

"ఏ దేశ చరిత్ర చూసినా,
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం,
పర పీడన పరాయణత్వం."

మరొకటిని చూడండి.-

"నిజంగానే నిఖిలలోకం
నిండు హర్షము వహిస్తుందా
మానవాళికి నిజంగానే
మంచి కాలం రహిస్తుందా
నిజంగానే, నిజంగానే
నిఖిల లోకం హసిస్తుందా
దారుణ ద్వేషాగ్ని నిండే
దానవత్వం నశిస్తుందా."

ఇది కవిత్వమే. కాని ఇందులో ఉషస్సులూ, విపంచులూ, తమస్సులూ, ఎదదలూ, మొదలైన పదజాలము లేదు. అటువంటి అర్థంగాని మాటలుంటేనే కవిత్వ మవుతుందనే భ్రమ కూడా పోయింది. కాళిదాసులోనూ, నన్నయ భట్టులోనూ. శ్రీనాథుడిలోనూ, కృష్ణశాస్త్రిలోనూ, శ్రీశ్రీలోనూ ఉండేదేదో నాలోలేదు. వాళ్ళు కవులు. నేను కాను. ఒకటికి పదిసార్లు అనుకుని ఏం లాభం?

ఒకవేళ వారిలో ఉన్నదేదో నాలోకూడా ఉంటే ఏం చేస్తాననేది ప్రశ్న. అశకు అంతుంటుందా? ఎన్నైనా చేద్దామనే ఉంటుంది. అయినా టూకిగా చెబుతాను.

ఈకాలంలో పుట్టాను. గనుక నాకు సంస్కృతం రాదుగాని అందరూ భోజనాల దగ్గిరా వీధిలోనూ కూడా సంస్కృతమే మాట్లాడే ఆ రోజుల్లో – దర్శన మాత్రం చేతనే ప్రతివాడిలోనూ కవితాశక్తి కలగించిన ఆ భోజుడి కాలంలో–పుట్టి కాళిదాసులాగా కవిత్వం చెప్పి ఉంటే ఎంత బాగుండును. ఎప్పుడూ కవిత్వంలో ఓలలాడుతూ, వింజామరలు వీచే దాసిదాని చేతిగాజుల చప్పుడుమీదా, అందగత్తెలైన దాసీజనం మీదా పద్యాలు చెబుతూ, భోజుడిచ్చే సమస్యలు పూరిస్తూ, పూర్ణిమ రాత్రి లందు ప్రొద్దున్నంగా భోజుడి వెంట ఉజ్జయినీ పురవీధుల్లో తిరుగుతూ ఉండేవాణ్ణి.

భోజుడు కవిత్వ ప్రియుడేగాని పాపం మంచికవిగాడు "చరమగిరి నితంబే చంద్రబింబం లలంబే" అని ఎవరైనా అనుకోవచ్చు. "యువతి జన కదంబే నాథ ముక్తోష్ఠబింబే" అనటంలోనే కవిత్వం ఉంది. "కళ్ళ ఎదట కనబడే దృశ్యాన్ని మాటల్లో పెట్టినవాడు కదా? కంటికి కనిపించని దానికి ఒకరూపం కట్టడంలోనే కవిత్వం ఉంది. అట్లాగే, "భోజనం దేహి రాజేంద్ర ఘృతసూప సమన్వితం" అనటానికి కవి కావాలా? "మాహిషంచ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి." అని ఉత్ప్రేక్షించేసరికి అది కవిత్వం అవుతుంది. ఆ విధంగానే భోజరాజు "దివా కాక రుతాద్భీతా" అనటంలో ఏమీ విశేషంలేదు. "దివా" అనటంలో ఏదో దాస్తున్నాడనేది కూడా వెంటనే అర్థమైపోతుంది. అందులో గాంభీర్యం లేదు. భోజుడు అతిగ్రంగా బయట పడిపోయినాడు. కాని "రాత్రౌతరతి నర్మదాం" అనేటప్పటికి వినేవాడి భావన రేకెత్తుతున్నది. రాత్రివేళ నర్మదను తరించాలి? ఏమో? మీరే ఊహించు కోండి. కవి అటువంటి చచ్చు వివరాలు చెప్పడు. భోజుడల్లేనే కాళిదాసుకూడా ఏదో దాస్తున్నాడుగాని చవుక బారుగా దాయటంలేదు. "తత్ర సంతి జలేగ్రాహః" అన్న

ముక్క ఎంత కుర్రతనంగా ఉందో వేరే చెప్పనక్కర్లేదు. "మర్మజ్ఞానైవ సుందరీ" అనటం చెప్పుతీసుకొట్టినట్టు మాత్రం ఉంది.

కవికి భావన ఉంటుంది. దానికి కవి వివశుడైపోడు. దానికంటె పైగా పెరిగి దానిమీద తనకుగల అధికారం ఋజువు చేసుకుంటాడు. భావన అనేది కవి వశమైనప్పుడే గద రససిద్ధి!

శ్రీనాథుడు "దాహం, దాహం" అని కేకలు వేస్తే ఎవరు చెప్పుకుంటారు.

"సిరిగలవారికి చెల్లును తరుణుల పదియారు వేల తగ పెండ్లాడన్, తిరిపెమున కిద్దరాండ్రా? పరమేశా గంగ విడుము పార్వతి చాలున్" అన్నాడు గనుక అది కవిత్వమయింది.

నిజంగా శ్రీనాథుడు గట్టివాడు. శ్రీనాథుడిలాగా నైషధమూ, కాశీఖండమూ, వీధి నాటకమూ, పల్నాటి వీరచరిత్ర మొదలైనవి రాయాలని నాకు లేనే లేదు. నేనే కవినై ఉంటే శ్రీనాథుడిలాగా ఆపత్ సమయంలో కూడా దర్జా వదలకుండా "కవిరాజు కంఠంబు కౌగలించెను గదా పురవీధి నెదురెండ పొగడదండ; సార్వభౌముని భుజస్కంధ మెక్కెను గదా నగరి వాకిట నున్న నల్లగుండు' అనీ, ప్రాణావసాన దశలో సయితం. 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథు డమర పురికి." అని అనగలిగితే ఇంకేం కావాలి? కథలు రాసుకునే నాబోటి వాడెవడైనా ఈ ఎత్తుకు పెరగగలడా?

ఒక్కోసారి ఆలోచిస్తే ఉదాత్తత కవినుంచి కవిత్వానికి సంక్రమిస్తుందా కవిత్వం నుంచి కవికి సంక్రమిస్తుందా అనేది తేల్చుకోవటం కష్టంగా ఉంటుంది. ఆ గొప్పతనమంతా కవిత్వంలోనే ఉందేమో ననిపిస్తుంది. "నిజదార సుతోదర పోషణార్థమై పాలికులైన "వారంతా" ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు, వాహనంబులున్ సొమ్ములుకొన్ని పుచ్చుకొని" అని పోతన్నలాగా గర్జించ గలరా? పాలకవర్గాన్ని పట్టుకొని సకారణంగాగాని, అకారణంగాగాని మనుజేశ్వరాధములన డానికి ఎన్నిగుండెలు కావాలి? పైపెచ్చు "కొన్ని సొమ్ములని తూస్కారమా? నాకు భాగవతమూ వద్దు, భోగినీ దండకమూ వద్దు. ఆ ఒక్క పద్యము చాలు, అదినేను రాసి ఉండకూడదూ?

ఈ మధ్యకాలపు కవులలో నన్నెవరూ ఆకర్షించటం లేదు. ఆరో అక్షరం టకారం పెట్టి పంపటంలో నాకు విశ్వాసంలేదు. "శుభమగుగాక నీకు" అని ఎవరిమీద

నన్నా పద్యం చెప్పితే వాళ్ళు కాస్తా చచ్చి ఊరుకుంటారంటే నమ్మను. ఒకవేళ చచ్చేదే నిజమైతే అందులో కవితా భావం ఏమీ ఉందనుకోరాదు. అదీకాక ఇట్లా చంపేవారిని హంతకుల కింద విచారణచేసి ఉరితీయవలసి ఉంటుంది.

అరింట "త" పెట్టి చంపటమేకాదు, కవిత్వం ద్వారా శపించడం కూడ నాకు నమ్మకం లేదు "అపామే నిన్ను గరవ అయ్యల గురవా" అన్న కవి గోడమీద పామునుచూచి ఆమాట అని వుండాలి.

చిత్రబంధ కవిత్వాలు కూడ ఎందుకో నన్నాకర్షించటం లేదు. "ధీర వరామా కుజపా ధీరవరామా కనయనధీ వరవరధీ ధీర వరవధీనయనక మారా వరధీవజ కుమారా వరధీ" అనేపద్యం ఎటుచదివినా ఒకటిగానే ఉంటుందంటే నిజమోకాదో కూడ నాకు చూసుకో బుద్ధి పుట్టలేదు. అల్లసాని పెద్దన ఆశువు చెప్పి రాయలచేత గండ పెండేరం తొడిగించుకున్నాడు. గనుక నేనుకూడా ఆశుధార చెప్పాలని కాస్త ఊగుతున్నప్పటికీ పానుగంటివారి కంఠాభరణంలో 'రామలక్ష్మణులు' జ్ఞాపకం వచ్చి ఆ కోరిక ఇగిరి చక్కాపోతున్నది.

ఇన్ని మాటలనుకోవటమే కాని నేనే కవినైతే ఎన్నడో పుట్టి గిట్టిన కవుల జాడల్లో పోదామనుకోవడం దేనికి. నాకు దగ్గర్లోలేరా దిగ్గజాల్లాంటి కవులు? వేదుల, దేవులపల్లి, అబ్బూరి, నండూరి, దువ్వూరి, విశ్వనాథ, తల్లావఝ్ఝల, నోరి, నాయని, బసవరాజు, శ్రీశ్రీ– వీరంతా ఎంతటి ప్రజ్ఞావంతులుకారు?

ఇంతమందిని చూడగానే ఒక్కటే అనుమానం; ఇంతమంది అయిపోవటమా, లేక కొందరే అయిపోవటమా అని తేల్చుకోవటం చాలాకష్టం. ఇంకా స్థూలంగా ఆలోచిస్తే భావ కవి కానా, దేశభక్తి కవి కానా, విప్లవ కవి కానా?

శ్రీ శ్రీ లాగా విప్లవ కవిఅయి జగన్నాథ రథచక్రాలను భూమార్గం పట్టించి భూకంపం పుట్టించటం ఒక వంక ఉపద్రవకరంగా కనిపిస్తుంది. మరోవంక రాయప్రోలులాగా "లేదురా యిటువంటి భూదేవి యెందు: లేదురా మనవంటి ధీరు లింకెందు" అనటం బొత్తిగా జడత్వానికి దారితీసేటట్టు కనిపిస్తుంది. గురజాడలాగా ఒక మహత్తరమైన దేశభక్తి సందేశం ఇస్తే చాలా బాగుంటుందికాని ఏమిటి ప్రయోజనం? ఒక చెంప బౌండరీ కమిషన్లు ఏర్పడుతుండగా, "దేశమంటే మట్టి కాదోయ్– దేశమంటే మనుషులోయ్" అని చెప్పి ఏం లాభం? పైగ దేశభక్తి గీతాలు ఒకదాన్నొకటి ఖండించటం కూడా జరుగుతుంది "వెనుక చూసిన కార్య

మేమోయ్, మంచి గతమున కొంచెమేనోయ్" అంటాడు గురజాడ. "గోదావరీ పావనోదార వాః పూత మఖిల భారతము మాదన్న వాడు" అంటాడు విశ్వనాథ.

అందుచేత నేను భావకవినౌతాను. భావకవి కావటంలో చాలా సుఖవు లున్నాయి. భావకవి ఒకసారి విహాయస విహంగ మౌతాడు. మరుక్షణానే "పాతాళ లోకంపు టిరుకు సందులందు దిగబ్రాకి వెరచు గాఢాంధరేఖ" కావటమే కాక "నేనేటు పక్షినౌదు?" అని కూడా దబాయిస్తాడు. భావకవి కాలేనిది లేదనే అనుకో వచ్చు. అతనొక వియోగ గీతిక, ఒక వియోగశాలినీహృదయవేదనా రేఖ. మొదట పిగూడూ లేని పులుగు రాయడుగా ఉండి. సంధ్యామనోజ్ఞ చిత్రి సింధూర రేఖగా మారి, మెలమెల్లగా రిక్క అవుతాడు. ఆకులో ఆకు. పూవులో పూవు, కొమ్మలో కొమ్మ. నునులేత రెమ్మ అయిపోగలడు. చేతలదగ్గిర కూడా భావకవికి అడ్డులేదు. ప్రేమించగలడు. నిట్టూర్చగలడు. గొంతెత్తి ఏడవగలడు, మధురంగా బాధపడ గలడు. ఈపనులు చెయ్యటంలోకూడా తన వ్యక్తిత్వాన్ని విశిష్టతనూ, ప్రత్యేకతనూ నిలబెట్టుకోగలడు. తనగొంతు మూగవోయిందంటూనే తియ్యనిగానం చెయ్యగలడు.

"నామరణశయ్య పరచుకొన్నాను నేనె
ఏనె నాకు వీడ్కోలుపు లిప్పించినాను
ఏనె నాపయి వాలినాను, ఏనె జాలి
నెద నెద గడించినాను, రోదించినాను.

ఇంతకంటె మానవ మాత్రుడికి అతీతమైన దేముంటుంది? మామూలు మనిషి ఎవరైనా తన ప్రియురాలిని, "ఓ యమావాస్యా తపస్వినీ" అని సంబోధించగలడా?.

కనీసం ఇందుకోసమైనా నేను భావ కవినై భావ కవిత్వం రాస్తాను.

# శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ

## "ప గ టి క ల లు"

పగటి కలలగురించి రాత్రిపూట కబుర్లేమి టనకండి. వీటివి చాలామంది రాత్రి కలలకు ముందుగానే ఏర్పాటు చేసుకుంటారు. పగటి కలలు కనడానికిగ్గాని, వాటిని గురించి వినడానిగ్గాని తీరికా ఓపికా ఉండవు. పగటికలలు మా కలవాటులేదని బుకాయించకండి. ఒకవేళ నిజంగా లేకపోతే అలవాటు చేసుకోండి. ఒంటికి చాలా మంచిది.

ఎందుకంటే, పగటికల అనేది మనిషికి దేవుడిచ్చిన మంచివరాల్లో ఒకటి. మనసులో పేరుకుపోయిన దురాశలను, నిరాశలను అందీఅందని ఆశలుగా పరి మార్చి వేసేమందు. మితంగా సేవిస్తే కండకూ గుండెకూ పుష్టినిచ్చే దివ్యౌషధం.

ఇందులో అందం ఉంది. ఆనందం ఉంది. కొన్ని ద్రవ్యాలుఇచ్చే ఉత్తేజం ఉంది. మరీ గాఢమైన పగటి కలలు ఎండమావులవంటివయినా, అంత వేడి ఉండదు. అంత నిస్పృహ కలిగించవు. అంత చేదుకాదు. కాని చేదుకూడా కాస్త ఉన్నమాట నిజం – గులాబీని ఆఘ్రాణిస్తూఉంటే ముల్లు సన్నంగా – గుచ్చుకుంటుంది. సిగరెట్టు కాలుస్తూ కునుకుతీస్తే చుర్రుమని మేలుకొలుపు పాడుతుంది. అలాగే ప్రతి పగటికలకీ ఒక మేలుకొలుపు – అలారం టైంపీస్‌లా ఏర్పాటయి ఉంటుంది. కలకీ, పగటి కలకీ తేడా ఒకటి. అది అప్రయత్నంగా కనేది. క్షణంలో సగంలో యుగంసేపనిపించేటంత పెద్ద కల కవచ్చు ఇది ప్రయత్న పూర్వకంగా ఆరంభించేది. ఎవత సేపు కలవుంటే, అంత సేపూ బుర్ర పనిచేస్తూనే ఉండాలి. కావలసిన ముడిసరుకు కోరిక – తీరిక.

కోరికఉంటే, తీరిక లేకపోయినా కంటారు చాలామంది. కోరిక కలకు బలవత్తరమైనది. రోడ్డుమీద నడుస్తున్నా! బస్సులో జనంమధ్య నుంచున్నా ఆఫీసులో చివాట్లు తింటున్నాకూడా పగటికల అర్జంటుగా కనవచ్చు.

గొప్పవాడు, బీదవాడు, బలవంతుడు, అర్భకుడు, మేధావి, మేదకుడు, సమర్థుడు, అసమర్థుడు అనే భేదం లేకుండా అందరికీ ఉచిత ప్రవేశం లభించే స్వర్గసీమ, పగటికల, ముఖ్యంగా రెండోకోవ మనుష్యులకు దివ్యౌషధం.

అనునిత్యం, అనుక్షణం ప్రపంచమంతటా కోట్లకొద్దీ పగటి కలలు ఉత్పత్తి అవుతూనే ఉంటాయి. వాటిలో బద్ధకిష్టులు హోరాహోరీగా పనిచేస్తూ ఉంటారు. దురదృష్టవంతులు 'డెర్బీస్వీప్‌లో' ఆరుకోట్ల రూపాయలు .... రూపాయలా డాలర్లా ... డాలర్ కెన్ని? ఐదు రూపాయలా ... ఐదార్లు వ్వ.... ఆరుకోట్ల బహుమతి అందుకుంటారు. ఆఫీసు ఉద్యోగులు మేనేజరుని నిలదీసి అడగాల్సిన నాలుగూ అడిగేసి కడిగేస్తూ ఉంటారు. రచయితలు వేయి పడగల నవలలూ, మహాప్రస్థానం గేయాలూ, కామేశ్వరరావుగారి వ్యాసాలు అవలీలగా రాసేస్తూ ఉంటారు. ఇంజనీర్లు తొలిసారిగా రేడియోలూ, విమానాలు, టెలివిజన్‌లూ కనిపెడుతూ ఉంటారు. నాగేశ్వరరావులా, సావిత్రిలా, రేలంగిలా, నటించి పారేస్తూ ఉంటారు. కాముకులు ప్రపంచ సుందరులందరినీ – కలకాకరు చొప్పున – పెళ్ళాడి కాపరాలు చేస్తూ ఉంటారు. అన్ని కలలకీ చివర – ఓ గుండుసూదిలాంటి నిజం సున్నితంగా గుచ్చుకొని మేల్కొలుపు పా[illegible]తుంది. సన్నటి నిట్టూర్పుతో, అది కల, ఇది ఇల, అన్న గ్రహింపుతో కథ ముగుస్తుంది. విషాదాంతం అని తెలిసిగూడా ప్రతి వ్యక్తి మోజుపడి కనేవి పగటి కలలే – ఆనంద బాష్పాలూ దుఃఖ బాష్పాలూ కలపటం లోనే ఆ మాధుర్యం ఉందేమో....

పగటి కలలలో తేలిక రకం ఉన్నాయి. అవి కలగాని కలలు, ఇవి టెక్నికలర్‌లా తీర్చిదిద్ది ఉండవు. ఇట్టే చెరిగిపోవు. అవి జీవితాంతం ఆడించి తిప్పలు పెట్టే కలలు.

జీతపు రాళ్ళతో అప్పులన్నీ తీర్చిపారేసి, అరువు లేకుండా ఇల్లు నడపడం.... అస లదికాదు. జీతంలో ఇకనుండి నెలకు పది రూపాయలు మిగిలేటట్టు చేసుకోవాలనుకోవడం, క్షౌరశిల్పి ఈసడింపుతో చూసి ముక్కల్ని కత్తిరించే సియర్స్‌తోటి క్షౌరం చేస్తాననేటంతలా జుట్టు పెరక్కుండా పెందాళ్ళే వెళ్ళడం, ఈసారి సెలవొస్తే సుబ్బరంగా రెస్టు తీసుకోవాలని దురాశ పడడం, ఇలాటివి. నూటికి తొంభై మందిని తిప్పలు పెట్టే వాటిలో విశ్రాంతి ఒకటి. నే నెరిగిన కుటుంబరావుగారు ఒకరున్నారు. ప్రసిద్ధ కథకుడుకాదు. ఆయన అసలు కలలు కనరు. కన్నా హెల్తు బద్ధంగా కని వాటిని తక్షణం సాధ్యములుగా పరిమార్చి వేస్తారు. నే చెప్పేది పెద్ద కుటుంబం ఉన్న రావుగారి గురించి.

వాట్‌సాక్ – ఏమిటండీ ఈ లైఫు ఏమిటంట. పొద్దున్న లేచింది లగా తూ ఎవరో తరుముతున్నట్టు మొహం కడుక్కోడం, కాఫీ తాగడం, పేపరు

చూడ్డం, తినడం, జీను వేసుకొని పరిగెత్తడం, పరుగెడుతూ పనులు చేయటం, ఇల్లు చేరడం, తరుముతున్నట్టే తినడం, పరిగ్రిస్, ఛ....ఛ... రన్నింగు రేసులాఉంది. బొత్తిగా రెస్టుండడం లేదు. ఈ కాలపు మానవులికి....అంటాడాయన ఎవరో తరుముతున్నట్టు అని వెళ్ళిపోతాడు. ఒక్క క్షణం అగాదా.... ఒక అరనిముషం సేపు ఆయన ముఖం ప్రసన్నంగా ఉంటుంది. కళ్ళు అరమోడ్చి తనలో తను చిరునవ్వు నవ్వుకుంటాడు.

ప్చ్.... ఈ సారి.... రేపు సెలవునాడు ఏమైనాసరే పూర్తిగా రెస్టు తీసుకు తీరతాను అంటాడు. మనం వద్దన్నట్టు. ఆ అరనిముషం ఎవరో తరుముతున్నట్టే ఆయన ఒక పగటి కల కంటాడన్నమాట.

"సెలవునాడు రెస్టంటే ఎలాగని మీ ఉద్దేశ్యం" అని అడిగాను. చెప్ప మంటారా? అంటా డాయన హుషారుగా, చెప్పడంలోనే అనుభవించినంత ఆనందం కనుపిస్తుం దాయన ధోరణిలో.

ఆ పవిత్ర దినాన ఆయన రోజూలాగా ఆరింటికి లేవడు. ఎనిమిదిన్నరకి బద్ధకంగా కళ్ళు తెరుస్తాడు. తెరిచాక మళ్ళీ మూస్తూ తెరుస్తూ ఆలోచిస్తు బద్ధకంగా ఓ అరగంటసేపు అలాగే పడుకుంటాడు తొమ్మిదింటికి మేనేజరుగారి పెద్దగ్గా యిలా బెడ్‌కాఫీ తాగుతాడు. తరువాత పళ్ళుతోమి టిఫెనుతిని, పంచి పట్టుకొని కూరల మార్కెట్టుకి వెళ్తాడు. దారిలో వాళ్ళతో వీళ్ళతో పిచ్చాపాటీచెప్పి కూరలు తీసుకొని ఇంటికి వస్తాడు. పదిన్నరవించి వంటింట్లో కూర్చుని పెళ్ళాంతో కబు ర్లాడుతూ కూరలు స్వయంగా తరుగుతాడు. వీలైతే కొన్నిటిని తనే పోపేస్తాడు, ఈలోగా శ్రీనించి మంగళంవరకూ పేపరు సావకాశంగా చదువుకుంటాడు. పన్నెండింటికి భోంచేసి, హాయిగా పడకేస్తే. నా సామిరంగా.... ఇంకా చాలా ఉన్నాయి. అలాటి కలలు. సాయంత్రం టిఫెన్లు, క్లబ్బు, లేదా గుడీ, బైస్కోప్ ....

మొన్నటి వారంనుండి ఆ విధంగా చెయ్యాలని శనివారం సాయంత్రం సుస్నాతుడై సంకల్పించారు. పగటి కలలు పండినవాడిని గాబట్టి ఈయనదే మాత్రం పండుతుందో చూద్దామని ఆరింటికే వెళ్ళి వాళ్ళింటి సావిట్లో కూర్చున్నా....

ఆనాడు ఆయనకి రివాజయిన ప్రకారం అయిన్నరకే తెలివొచ్చింది. లేచి సావిట్లోకొచ్చి కటుక్కున నాలిక్కరుచుకున్నాడు. ఎనిమిన్నరదాకా లేవకూడ దనుకున్నాడుగాని వెధవది అలారం పీసులా అలవాటైపోయింది. పైగా - పెరట్లో

దాపేడి, గుమ్మంలో పాలవాడు, సావిట్లో పిల్లలు ఎలక్షన్‌లో ఉపన్యాసకుడి కంతా అలా గొంతెత్తి మాట్లాడుకుంటున్నారు.

అమ్మని కాఫీ తెమ్మనురా – అన్నాడు కుర్రాడిలా.

మొహం కడుక్కోవా నాన్నా ? అన్నాడు వాడు.

కాఫీ తెమ్మంటె – అన్నాడాయన.

ఆవిడ వచ్చింది. విడూరం గాకపోతే పాచి మొహంతో కాఫీయా.... తేండి .. లెంపే – అంటె.

అమ్మా కాఫీ గిన్నెలు వేస్తారా, అలా వారింటి కెళ్ళరానా – అంటోంది పెరట్లో పనిమనిషి.

లేవండి అది వెళ్ళిపోతు దటా - పోతే మళ్ళీ నేతోముకు చావాలి – అంది ఇల్లాలు.

కుటుంబరావుగారు పెరట్లోకి పరిగెత్తాడు.

అరగంట తర్వాత మార్కెట్టులో కూరలు కొనబోయారాయన. బోలెడు కూరలు కొని హాయిగా, తీరిగ్గా అన్నీ తరగాలని లెక్కలువేస్తు వచ్చిన పెద్ద మనిషికి వంకాయ రూపాయండి. దొండకాయ రూపాయపావలా, అంటూ ధరల దండకం చదివేసరికి ఉషారు చల్లారి పోయింది. రెండ్రూపాయల కూరలు కొంటే గాని అరగంట తరిగిన సరదా తీరేట్లా కనబడదే__

ఏమిటీ ధరలిలా మండిపోతున్నాయి అని మండిపడుతూ కాసిని కూరలు కొని ఇంటికి బయల్దేరాడు.

వీళ్ళందరి పొగరూ అణచాలంటె ఇలాకాదు.... అసలూ.... నెమ్మదిగా ఆయన పగటి కలల స్వర్గసీమలోకి జారిపోయాడు. అందులో ఆయన ప్రధాన మంత్రి. ధరలు పెంచితే డొక్క చీరేస్తానని రూల్సు వేయించి, ప్రజలని కాపాడా లనే పట్టుదలతో అదే ఎలక్షను ప్లాటుఫారంగా ఎన్నికై, మెంబరై మంత్రియ్యాడు....

కుటుంబరావుగారి పగటి కలల వయినాలు నీకేం తెలుసునని మీ రడక్కండి. ఆయన ముఖంచూస్తే ఆయన కల ఎప్పుడు ఆరంభమైందో మీక్కూడా తెలిసి

పోతుంది. చూస్తూ ఉండగానే ఆయన చూపులో ఒక రకంశూన్యత కనుపిస్తుంది. కోపంమీద కలగంటున్నప్పుడు ముక్కుపుటాలు పూరిస్తాడు. గెడ్డం కొనదేరుతుంది. పిడికిళ్ళు వాటంతటవే కాస్త బిగుసుకుంటాయి. ఇంకో పది క్షణాలకల్లా ముఖంలో ఎరుపు దిగుతుంది. బిగించుకున్న నరాలు సడలుతాయి. ముఖంలో ప్రసన్నత వెన్నెలలా కాస్తుంది. ఉండుండి చిరునవ్వులు పూస్తాయి. అంటే అర్థం – కోపం కొద్దీ మినిష్టరయిన కుటుంబరావుగారు – మంత్రి కాగానే మండుతున్న ధరలమాట మరిచిపోయి, వరండా అంత కారులో వెనుక సీటులో కూర్చుని వెళ్తున్నాడన్న మాట. సన్మాన సభలో దండ వేయించుకున్నా డన్నమాట. బాదం హల్వా చలిమిడి ముద్ద అంత పుచ్చుకోవడమేకాక పిల్లలకి పొట్లాలు కట్టించి పంపిస్తున్నా డన్నమాట. పూలదండలన్నీ తుంచి ఆవిడగారిమీద పూలవాన కురిపిస్తున్నాడన్న మాట. ఇవన్నీ ఆయన ముఖ కవళికల్లో మనం సునాయాసంగా చదువుకోవచ్చు.

ధవల మంటలు చల్లార్చే కలలో నడుస్తున్న కుటుంబరావుగారి కాలికి ఇలలో అంధ్రా రోడ్డుమీద కంకరాయి ఒకటి తక్కువ తగిలింది. తక్షణం ఆయన మంత్రిపదవి త్యాగంచేసి 'అమ్మబాబోయ్' అన్నాడు. ధరలకన్న ఎక్కువగా ఒళ్ళు మండిందాయనకి. తక్షణం కాలికి మందేనా వేసుకోకుండా, పి. డబ్ల్యు. డి. శాఖలో మంత్రి అయి, రహదార్ల శాఖపని పట్టించడం మొదలుపెట్టాడు. ఆయన ముఖంలో కర్కశత్వం, ఆ పళ్ళు గిట్టకరుచుకోవడం చూస్తే ఆయన శక్రిటరీల చేతా రోడ్డు కంట్రాక్టర్ల చేతా రోడ్లమీద రాళ్లేరించి పనుచేయిస్తున్నా డనిపించింది.

రెండు తీవ్రమైన కలలు కని ఇంటికొచ్చేసరికి ఆయనకి ప్రాణం వాలొచ్చింది. కూరలు నువ్వే ఏదూ అని భార్యకు సూచించి, మంచినీళ్ళు తాగి అరుగుమీద కూర్చొని అప్పుడే వచ్చిన ఆదివారం పత్రిక విప్పాడాయన.

కాస్త అందులో కథలూ వ్యాసాల సెక్షనిలా పారెయ్యండి అంటూ ఒక చెయ్యివచ్చి పేపరు లాక్కుని కావలసింది తీసుకుని మిగతా కాయితాలు ఆయన ముందు పడేసింది. కుటుంబరావుగారు ఆపాద మస్తకం కోపంతో ఉక్రోషంతో వణికిపోయాడు. తరువాత అరగంటవరకూ చూపు పేపరుమీద ఉన్నా మనసు పక్క పెద్దమనిషి జబర్దస్తీ మీద ఉంది.

రెస్టు తీసుకుంటున్నారా అన్నాను వెళ్ళి.

నా బొంద...అన్నాడు ముక్తసరిగా.

బహుశా ఆయన కల్చరల్ మినిస్టరయి ప్రజలకి పేపరుకొనే అలవాట్లు, పక్కవాడిది లాక్కోకుండా ఉండే నిగ్రహం మప్పుతున్నాడనుకున్నాను.

హడావిడిలో టిఫెన్ ప్రోగ్రాం మరిచిపోయినందువల్ల కోపంతోపాటు ఆకలి ఉధృతమైంది. ఆదివారం కదా అని దేవుడి పాటలు పాడుతూ సావకాశంగా మడి కట్టుకున్న ఇల్లాలు మీదకు తిరిగిం దదంతా. ఆదివారం నాడయినా స్థిమితంగా తిని పడుకొనే యోగంలేదు. అంటూ లేచాడాయన.

ఆవిడ నీళ్ల కడవ దింపింది.

తొంగిచూసి నవ్వుకొంటున్న పిల్లలని రెండువేసి వెళ్లగొట్టి ఇల్లాలిని బ్రతిమాలాడాయన, ఇప్పుడు నే నేమన్నానే – అంటూ.

కోపం తగ్గినందువల్లనో, అన్నం మాడువాసన వచ్చినందువల్లనో మొత్తానికి ఆవిడ గుమ్మంమీంచి లేచింది.

భోజనం అయ్యా అమ్మయ్యా అనేసరికి ఆఫీసరుగారి జవాను కబురుతెచ్చాడు ఆయాసపడుతూ. అదేంతపనీ అని వెళ్లినవాడికి ఆయన నడ్డివిరిగేపని చెప్పాడు. పిల్లలకి మ్యాపులు వేసిపెట్టాలయ్యా గొడవ పెడుతున్నారు – అంటూ అటు తిరిగి పడుకున్నా డాఫీసరుగారు.

ప్రపంచంలో విద్యా విధానాన్ని రద్దుచేస్తూ సంతాన నియంత్రణం కఠినం చేస్తూ ఓ పగటికల కని, పని పూర్తిచేసి నాలుగింటి కింటికి చేరిన కుటుంబరావు గారు వాలుకుర్చీలో రామచంద్రా అంటూ వాలిపోయారు

ఈసారి సెలవునాడు పూర్తి రెస్టుతీసుకోవాలండీ అన్నారు ఎదురుగా లేచి నాతో. పదిహేనేళ్లగా నడుస్తోం దాయన కల. ఇంకా ఫలించలేదు. నా కొకటే మార్గం తోచింది. ఈసారి సెలవునాడు పదినిముషాలు తీరిక చేసుకొని – ఒక సెలవునాడు పూర్తిగా రెస్టు తీసుకున్నట్లు ఒక టెక్నికలర్ పగటికల కని పారెయ్యడం మంచిది అని.

(జ్యోతి – సెప్టెంబరు' 61)

# శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

## 'బహుకాల దర్శనం'

[బెజవాడ రైల్వేస్టేషను ప్లాట్‌ఫారం. దానికి సంబంధించిన కలకలం. దూరాన్నుంచి ఒకగొంతు "బహుకాలదర్శనం, బహుకాలదర్శనం" అంటుంది.]

వీరయ్య: ఒరేయ్ వెంకన్నా! సామాను తీయించి కార్లో పెట్టించు.

వెంకన్న: చిత్తం, వీరయ్యబాబూ

వీరయ్య: ముందు గవర్నర్‌పేట పోనియ్యింటికి, కాస్త స్నానంచేసి, వొళ్లు మరమ్మత్తు చేసుకుని మరీ వెడతా కోర్టుకి.

వెంకన్న: నిద్దరలేనట్టున్నారు. ఫస్టుక్లాసు దొరకలేదేఁవిటి?

వీరయ్య: ఫస్టుక్లాసులేదు సరిగదా వొట్టి సెకంక్లాసులో ఓ షావుకారు పక్కన పడ్డాను. పాపం. రాత్రింతా నామీద యిష్టంకొద్దీ, నామీదే వొరిగి పడుకున్నాడు. ఆ చెమటా అంతసూ, యిటువైపు చెయ్యి కొట్టిపారేసు కోవాలనిపిస్తుంది.

శ్రీరాములు: బహుకాలదర్శనం! బహుకాలదర్శనం! అఁ, యేఁవిటీ? యెన్నాళ్ళకూ యెన్నాళ్ళకూ! యెప్పటిమాటో! నిన్నా మొన్నా సంగతా? సరి సరి. వీరయ్యగారూ అలా చూస్తారేఁవిటి? నేనిట్టే పోల్చుకున్నాను మిమ్మల్ని. వయస్సు ముదిరినా, తేజస్సు యెక్కడికిపోతుందీ? యెన్నేళ్ళొచ్చినా ఆ నేవళం చూడండి. అఁ, యింకా పోల్చుకోలేదు నన్ను (నవ్వుతాడు)

వీరయ్య: యెక్కడ కలుసుకున్నామండి మనం?

శ్రీరాములు: చివరికి అంతవరకూ వచ్చింది యీ శ్రీరాములుగాడి గతి. వీరయ్యగారే పోల్చుకోలేకపోయారన్నమాట. నాన్నగారి నడగండి, పేరూ .... అవీ....

వీరయ్య: నాన్నగారి పేరు శరభయ్యగారు.

శ్రీరాములు: (నవ్వుతాడు) సరి సరి. నాపేరు నాన్నగారికి చెప్పమంటున్నా గానీ, నాన్నగారి పేరు నాకు చెబుతున్నారా? రేపు నాపేరే నాకు గ్నాపకం చేస్తారు.

వీరయ్య: నాన్నగారినెలా యెరుగుదురు? నాన్‌కోఆపరేషన్ రోజుల్లోనా?

శ్రీరాములు: రండి. అలా దారికి రండి. ఆయనెవ్వెరగనివాళ్లు ఆఖిలాంధ్రలో లేరు. ఇహ నా సంగతా? ఆయనా, నేనూ కలిసి....

వీరయ్య: కడలూరు జైల్లో వుండేవారా?

శ్రీరాములు: వూరికే వుండడంకాదు. ఒక్క నిమిషం వదలకుండా రామలక్ష్మణుల్లాగ, జంటనగరాల్లాగ వుండేవాళ్ళం. జైల్లో రోజూ నేను వండడం, ఆయన తర్వాత పనీ

వీరయ్య: (కొంచెం నవ్వుతూ) అంటే తినడం అన్నా?

శ్రీరాములు: అదిమాత్రం తక్కువపనా? 'రామయమంత్రి భోజన పరాక్రమం' అని వూరికే అనేశాడా మహాకవి అయినా నేనన్నదాని కదా అర్థం వీరయ్య బాబూ. ఆయన్ని కింద అడుగెట్టనిచ్చేవాణ్ణా అని. 'రాజసింహాని కంతాన ప్రాణముండ' అన్నట్టు, నేను బతికుండగా ఆయన్ని వేలెత్త నిచ్చేవాణ్ణా? నో, న్హో! జైల్లో భోజనం ఆయాక, నేనేదైనా గ్రంథం చదవడం, ఆయన హాయిగా కళ్ళు మూసుకుని వింటున్నట్టు....

వీరయ్య: (నవ్వుతూ) నిద్రపోవడమూనా? శ్రమంతా మీద దురా యెప్పుడూ.

శ్రీరాములు: ఆ: తప్పకుండా శ్రమంతా ఈ శ్రీరాములుదీ, సౌఖ్యమంతా శరభయ్య న్నది. ప్రైవాట్? ఏంచేతకాదు? కాని, వీరయ్యబాబూ: నువ్వో (కొంచెం నవ్వి) నువ్వనేస్తున్నా, నాన్నగారు గ్న్యాపకం వచ్చి, అనేసేస్తున్నా....

వీరయ్య: అనండి. నన్నలాగే అనండి.

శ్రీరాములు: ఆ అనేస్తా. అన్నా? అన్నా అంటాను అలాగే అనేవాణ్ణి ఆరోజుల్లో అప్పుడింతకంటే చిన్నవాడివి మరీ.

వీరయ్య: (నవ్వుతూ) అవును, ఇదివరకింతకంటే చిన్నవాణ్ణయియుంటాననుకుంటాను

శ్రీరాములు: అలా అనకండేం అది అస్తమానమూ అందరి విషయంలో రైటుకాదు. కొందరు మొదట పెద్దవాళ్లయి, క్రమక్రమంగా పసివాళ్ళయిపోతారు. వీళ్లు హారతికర్పూరం వతు. మరికొందరు మొదట చిన్నవాళ్లుగావుండి, దరిమిలాని ఉవ్వెత్తుగా పెరిగిపోతారు వీళ్ళు ఆయకుడుం బాపతు. ఇహ కొందరు చప్పగా అణిగున్నట్టుండి, గాలిపోసుకుని గుండ్రంగా లావుగా పెరిగిపోతారు వీళ్లున్నారే, వీళ్ళు రబ్బరుబెలూను తాలూకు నువ్వో

రాజా బహదుర్, నాన్నగారిలాగ. అప్పుడూ, యిప్పుడూ, యెప్పుడూ పెద్దవాడివే. కనక వీరయ్యబాబూ! నువ్వెప్పుడూ థర్డుక్లాసులో ప్రయాణం చెయ్యకేం? అజ్జూసి నేను సహించలేను.

వీరయ్య: ఏం జెయ్యమనండి? ఒహప్పుడూ....

శ్రీరాములు: ఒహాప్పుడూలేదు, గిహప్పుడూలేదు. ఒప్పుకోను నేనంతే. నాచేతిలో చెయ్యి వెయ్యి. 'హొత్తు, థర్డుక్లాసులో ప్రయాణం చెయ్యను' అని. కావలిస్తే స్పెషల్ ట్రెయిన్ వేయించుకో, నేను ఎత్తుకు తిప్పిన మా శరభయ్యన్నయ్య కొడుకు మీద, హమ్మొయ్యో, మలపగేదె వాహడు. చింత వండు బస్తాలా మీద వారగనా? వీల్లేదు.

వీరయ్య: (నవ్వి) ఫరవాలేదు. ఏం జెయ్యను?

శ్రీరాములు: అదీ నిజమే మరి. వెనక నేనూ, నా భార్యా యిలాగే ప్రయాణం చేస్తున్నాం. కాళ్ళసవారీవాళ్ళం కనక థర్డుక్లాసులో. భార్యాభర్త లెక్కాప యిద్దరు. వాళ్ళ చుట్టుకొలత ఎక్కువ. అంటే వొకరిచుట్టూ వొకరు నడిస్తే వాళ్ళకానాటికి వ్యాయామం సరిపోతుంది. ట్రెయిను కొంచెం కదలడం వేమిటి, ఆ వూపుకి భర్త నావాళ్ళోనూ, భార్య మా ఆవిడ వాళ్ళోనున్నూ గారాబంగా పడుకుని నిగ్రపోయారు. మాకు చంటిపిల్లల్లేనివరదా తీరింది. అయితే హృదయాన్నే ట్రెయిను దిగడం మాత్రం కష్టం అయింది. వాళ్ళ మాలీసు లేకుండా. అది మాఖర్మం. నీకేమయ్యా? మహరాజువు! అది సరేగాని. నీకెందరు పిల్లలు వీరయ్యబాబూ!

వీరయ్య: ఒక పిల్లవాడు ఒక పిల్ల.

శ్రీరాములు: పేర్లేమిటి?

వీరయ్య: అమ్మాయిపేరు ఝాన్సీ.

శ్రీరాములు: భేష్. వీరనారి పేరు పెట్టావు. అబ్బాయిపేరు? తాంతియా తోపీయేనా లేక నాన్నగారి పేరు పెట్టావా? చూడాలయ్యా నీపిల్లల్ని వోసారి.

వీరయ్య: రండి, నాతో మా ఇంటికి.

శ్రీరాములు: రానూవద్దును; అయితే తొందరగా రాజమండ్రి వెళ్లాలి. నా టిక్కెట్టూ సామానుతో సహా, మా కేశవులు—మా బావమరిదిగాండి— ముందుగా ట్రెయినెక్కేశాడు. అది కదిలింది, నేనిలా వుండిపోయాను.

వీరయ్య: అయ్యో! నేను మీకు రాజమండ్రి టిక్కెట్టు తెప్పించనా? చూడు, వెంకన్నాకి నువ్వు పెళ్లి....అలా ఆలోచిస్తారెందుకూ?

శ్రీరాములు: ఉఁహూ! రాజమండ్రిలో దిగనా. తిన్నగా వాల్తేరు కేపోనా అని.

వీరయ్య: పోనీ మీరేఁవనుకోపోతే ఈ పదిహేను రూపాయలు దగ్గిరుంచండి. నాన్నగారివంటివారు కదా.

శ్రీరాములు: అ....లా....గే....మ....రీ.

వీరయ్య: నాకు కోర్టుకు టైమయింది, వెళ్లొస్తా.

[జోళ్ల చప్పుడు. దగ్గరగా వస్తున్న రెండుగొంతులు]

శేషమ్మ: కాదో, సుబ్బమ్మా! కామిపెళ్లికి అయిదువేలు పోశాం.

సుబ్బమ్మ: అయితేనేమే శేషమ్మొదినా! సూరిగాడి పెళ్లికి పదివేలు లాగేరుకాదే. అయిదువేలు మిగులు. అ పెళ్లప్పుడు అమలాపురం అమలాపురం అదే గోల. వియ్యంకుడు వెంకటేస్వర్లుగారు డబ్బు తేలేక గిజగిజ లాడేడని. యిప్పుడు మళ్లీ రాజమండ్రి పెళ్లిలో....

శ్రీరాములు: బహుకాలదర్శనం! బహుకాలదర్శనం! శేషమ్మక్కయ్యా! ఆఁ: యేమిటి? యెన్నాళ్లకూ యెన్నాళ్లకూ! యెప్పటిమాట? అబ్బో, నిన్నా మొన్నా సంగతా?

శేషమ్మ: ఎవరుబాబూ? మరిచిపోయాను వెర్రిమొహాన్ని.

శ్రీరాములు: అందుకు సందేహమా? అవును మరీ. నువ్వలా అనవలసిందే. ఆ బెట్టు యింకా వుండవలసిందే. మీరు మగపెళ్ళివారాయెను. మేము ఆడపెళ్లివారమాయె,

శేషమ్మ: ఏ పెళ్లి బాబూ?

శ్రీరాములు: వెంకటేస్వర్లు మాఁవయ్యింట్లో....అమలాపురంలో....

శేషమ్మ: సూరిగాడి పెళ్లా? నాగమణి, వాడి పెళ్లాం.

శ్రీరాములు: అ నాగమణి వరసకి నాకు మరదలు. అయినా నన్ను నువ్వు పోల్చు కోలేవు, పెళ్ళిలో నాడ్యూటీ హమేషాగా వంట పందిట్లో.

సుబ్బమ్మ: అవును. సూరిగాడి పెళ్ళిలో చూసినట్టుంది.

శ్రీరాములు; భేష్. పోల్చింది భూషమ్మోదిన, శేషమ్మక్కయ్యా.

సుబ్బమ్మ: నాపేరు భూషమ్మ కాదు.

శ్రీరాములు; కాకపోతే మించిపోలేదు. ముఖం పైకెత్తి చూస్తే విష్ణులా పిలవాలని పించింది వొదినా.

సుబ్బమ్మ: యితగాడెవడేవ్, యిలా మాట్లాడుతున్నాడు?

శేషమ్మ: వెంకటేస్వర్లుగారి మేనల్లుడే సుబ్బమ్మా: చదువుకొద్దీ....

శ్రీరాములు: వరసకు వొదినవు కాబట్టి అలా అన్నాను, సుబ్బమ్మొదినా! నాతప్పు క్షమించమని మగపెళ్ళివారి తరపునా, యావత్తు అమలాపురమూ

కోనసీమ తరపునా అడుగుచున్నాను.

శేషమ్మ: పాపం యాఁవనుకోకే, అంతగా దేముల్లాడుతుంటే.

శ్రీరాములు; శేషమ్మక్కయ్యా: గ్యాపకం వుందా? ఆ పెళ్ళిలో మమ్మల్ని- ఆడ పెళ్ళివారివి- మీరు మహ యేడిపించేవారు. వడ్లల్లప్పుడు, వోనాడు అప్పడాలు లేవనిపించాలని ఆడపెళ్ళివారు తివడం మొదలుపెట్టారు. అప్పడాలు విరుస్తూ వడ్డిస్తుంటే, అమలాపురం అమలాపురం యావత్తూ టాప్ టాప్ ఫెటీ ఫెటీమని కొంపలంటుకున్నట్టు చప్పుడు. అందులో మగపెళ్ళివారి దేమి తిండీ, మీది గాలి. వొప్పుకుతీరవలసిందే. అరోజున సుబ్బమ్మొదిన్ని చూడాలి- పల్నాటియుద్ధంలో నాయకురాలి లాగా, నరకాసురవధ సమయంలో సత్యభామలాగ.

సుబ్బమ్మ: యిదేఁవిటే, యితగాడు నన్ను పట్టించాడూ?

శేషమ్మ: పాపం వొదిన వరుస కాదుటే! చదువుకున్నాడు కూడా?

శ్రీరాములు; శేషమ్మక్కయ్యా! ఆ విందురోజున వియ్యాపురాలి పాట పాడింది, ఆ పిల్ల ఎవరు! 'విసురుకొనుచు వచ్చెను వియ్యాపురా లొడ్డనలకు' అంటూ పాడింది?

శేషమ్మ: మా పెద్దమ్మాయి సీతాలక్ష్మి.

శ్రీరాములు: సీతాలక్ష్మా! భేషయిన గొంతు- పత్తిరాట్టం: కంయిమని ప్యాక్టరీ కూత లాగ....సీతాలక్ష్మికి పిల్లలా?

శేషమ్మ: ఆ అయిదుగురు, యిహ వాలు బాబూ.

శ్రీరాములు: చెప్. అయిదుగురు అనగూడదు. దిష్టి కొడుతుంది. రెండుకావిళ్లకొమ్మ్మ ఆనాలి. సుబ్బమ్మొదినా, నీకు?

సుబ్బమ్మ: చాల్లే.

శ్రీరాములు: చాలో, లేదో, మా అన్నయ్య చెప్పాలి. ఆ చంకని పిల్లాడు కూడా నీ కొడుకేనా?

సుబ్బమ్మ: ఆ!

శ్రీరాములు: భేష్! కంచె కళ్ళుమూసుకుని కనాలి పిల్లల్ని గాంధారిలాగా. సుబ్బమ్మొదినా, నీకు యీ శ్రీరాములు నమస్కరిస్తున్నాడు. అయితే శేషమ్మక్కయ్యా! టిక్కట్టుకొన్నారా? లేకపోతే నేనుతెస్తా. రెండు పెద్ద టిక్కట్లూ ఆరు చిన్నవీనా?

శేషమ్మ: అవునన్నయ్యా. అఁ! కొన్నాం.

శ్రీరాములు: రాజమండ్రిలోనే దిగుతారా? బండిలో యెక్కించి కూడా వద్దును గాని ఆడవాళ్ల కంపార్టుమెంటులో నన్నెక్కనివ్వరు. అక్షరాలు తెలియనట్టు యెక్కి కూచుందాం అనుకున్నా, తలుపుమీద అడమనిషి బొమ్మ గూడా అఘోరించారు.

శేషమ్మ: ఫరవాలేదన్నయ్యా, మేఁవెక్కుతాం.

శ్రీరాములు: అఁహ, అందుకోసం గాదు. తర్వాత మా వెంకటేస్వర్లు మాఁవయ్యకి తెలిస్తే చివాట్లెట్టడూ? అతనితో చెప్పు శేషమ్మక్కయ్యా, "యిలా శ్రీరాములు పెట్టే పరుసూ బెజవాడస్టేషనులో పోగొట్టుకున్నాడూ, తర్వాత యెరుగున్న వాళ్లెవరిదగ్గరేనా డబ్బుచ్చుకొని వస్తానన్నాడూ" అని.

శేషమ్మ: అలా యెందుకు శ్రీరాములన్నయ్యా! సుబ్బీ, నీదగ్గరెంతుందే?

శ్రీరాములు: యెంతున్నా నాకొద్దులెద్దూ. పాపం.

శేషమ్మ: అలా కాదు. అక్కడ పుచ్చుకుంటాంలే, శ్రీరాములన్నయ్యా.

సుబ్బమ్మ: ఆరు రూపాయలుంది.

శేషమ్మ: ఇదుకో అన్నయ్యా: ఆ ఆరున్నూ ఈ మూడూ తొమ్మిదీనీ తీసుకో, మరి పరిగెత్తూ రైలొస్తుందేమో, టిక్కట్టు కొనుక్కో.

శ్రీరాములు: అలాగే అక్కయ్యా! నేను మళ్ళీ రాజమండ్రిలో కనబడుతాను మగాళ్ళబండిలో ఎక్కుతాను... ఇదుగో! పిల్లల్ని తొంగి చూడనియ్యకండి కిటికీలోనుంచి.

[ట్రెయిన్ వచ్చిన చప్పుడు, కూతల సందడి]

శ్రీనివాసరావు: ఒరేయ్ చెంచురామయ్యా! ముందు కావలిలో దిగి సుబ్బుకృష్ణయ్యని తీసుకొని నెక్స్టు ట్రెయిన్‌లో మద్రాసు పోదాం.

చెంచురామయ్య: సరే.

శ్రీరాములు; బహుకాలదర్శనం! బహుకాలదర్శనం! యెన్నాళ్లకూ యెన్నాళ్లకూ! యెప్పటిమాట! అబ్బో, విన్నా మొన్నా సంగతా, చెంచురామయ్యా!

శ్రీనివాసరావు: అయిందా పలకరించడం? మేం మాట్లాడుతుంటే విన్నావుకాబట్టి వీడు చెంచురామయ్యని నీకు తెలిసిపోయింది నన్ను పోల్చుకోలేవు గాబట్టి నాపేరు శ్రీనివాసరావు. మేము కావలిలో దిగి సుబ్బుకృష్ణయ్యని తీసుకొని మద్రాసు వెడతాం. ఇంకా మాసంగతులేవేనా కావలిస్తే, ముందే చెప్పేస్తా, నీకు తెలియదు కనక.

శ్రీరాములు: [జనాంతికంగా] నీ అమ్మకడుపు బంగారం గాను! నువ్వు, అసాధ్యుడిలా వున్నావే... ఈ చెంచురామయ్య ఏం జేస్తుంటాడు నాయనా, శ్రీనివాసరావూ?

శ్రీనివాసరావు: పద్యాలవీ రాస్తుంటాడు.

శ్రీనివాసరావు: వొద్దు బాబూ వొద్దు. మాన్పించెయ్యాలి వెంటనే ముదిరితే మహాకష్టం. తనే రాగం అవీపెట్టి చదువుతాడా అభినయిస్తూ?

చెంచురామయ్య: ఎవడో మహ సరదావాళ్లా వున్నాడు. నువ్వెరుగుదువా యితన్ని?

శ్రీనివాసరావు; యెరుగుదువని అతనికి తెలియదు.

శ్రీరాములు: యెక్కడెరుగుదువు బాబూ నన్ను?

శ్రీనివాసరావు: రాజమండ్రిలో, బెజవాడలో, కాకినాడలో. విశాఖపట్నంలో ఎక్కడ బడితే అక్కడ: స్టేషనుదగ్గర, బస్సుస్టాండులదగ్గర, ప్రస్తుతం నీకు వచ్చిన చిక్కేమిటి? పర్సు పారేసుకున్నావా? భార్యకి పురుడొయ్యాలా? పిల్లాడికి చదువా?

శ్రీరాములు: నాయనా! అన్నీ కూడొచ్చాయి యిప్పుడు ...ఇప్పుడేవొస్తా అలావెళ్ళి.

చెంచురామయ్య: ఓహో? యెరుగున్నట్లు -పలకరించి, యేదో సాకు చెప్పి డబ్బు దండుకునే బాపతా? ముసలిముండాకొడుకు అసాధ్యుళ్లా వున్నాడే, అ దిక్కుమాలిన మంచిమోహంపెట్టి.

శ్రీనివాసరావు: అలా అనకు అతన్ని. అతని కథంతా నీకు తెలియదు. ముప్ఫయ్యేళ్ళ క్రితం, దేశంలో ఎరగనివాళ్ళు లేరు. నాన్ కో-ఆపరేషన్ రోజుల్లో, ఆస్తి పోగొట్టుకుని, దెబ్బలుతిని, జైల్లోపడి, ఆలు బిడ్డలూ తామూ మిగలారు. యిప్పుడు పూట గడవటం కష్టం అతనికి. తానొక్కడే అయితే హాయిగా చచ్చిపోయుండును. పెళ్లాం బిడ్డలకోసం యిదంతా.

చెంచురామయ్య: అయితే ఇలాంటి దగాకోరు పనులెందుకూ? దొంగవేషాలు.

శ్రీనివాసరావు: తక్కువవాడు తక్కువ మోసంచేస్తే. అది దారుణమైన నేరం. ప్రభుత్వాలూ, ప్రముఖులూ చేస్తే, అది రాజకీయతంత్రం, మంత్రాంగం. చిన్నవాడు చిన్న అప్పుచేసి యెగేస్తే వాడికి కారక్టర్ లేదు. భగవద్గీతలో శ్లోకాలు విసురుతూ మధ్య మధ్య ప్రార్థనలూచేస్తూ లక్షలు ఋణంచేసి యెగేసి విశేషంగా గౌరవంగా చెలామణీ అవుతున్నవాళ్ల నెరుగుదుము. అయితే.... శ్రీరాములూ! ఇలారా.

శ్రీరాములు: [దూరంనుంచి] వస్తున్నాబాబూ!

శ్రీనివాసరావు: ఇప్పుడు దేనికోసం చందాలు వసూలు చేసుకుంటున్నావు?

చెంచురామయ్య: అంటే యిదివరకు పేటికోసం చేశాడు?

శ్రీనివాసరావు: ఇదివరకొకసారి కనబడ్డప్పుడు ఇప్పుడేం జేస్తున్నావు శ్రీరాములూ అంటే 'బీహారు భూకంపానికి చందాలు పేకరించు కుంటున్నాను" అన్నాడు. ఆ తర్వాత గోదారి వరద బాధితులకి. ఆలాగే భగవంతుడికైనా అతనిమీద దయుంది కాబట్టి ఏ వరదో, భూకంపమో వొస్తున్నాయి

శ్రీరాములు: యేంజెయ్యను బాబూ! ఎదో అలాంటిదే చూసుకుంటాను. ఏం అలా చూస్తున్నావ్? నీకూ కోపం వచ్చిందా నామీద?

శ్రీనివాసరావు: నాకెప్పుడూ నీమీద కోపంరాదు. ఇదిగో పదిరూపాయలు. నువ్వో పది తియరా చెంచురామయ్యా. వెళ్ళిరావా? మళ్లీ ఎప్పుడో?

రాములు: [గద్గదికతతో, కళ్లంటనీళ్ళు వచ్చినట్లు] బహుకాలదర్శనం!

# శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

## 'చుట్ట'

చుట్ట త్రాగడం సనాతనమైన ఆచారమేనా, లేక ఈ యుగమువారు అలవరుచుకొనిన ఒక దురభ్యాసమా అని ప్రశ్న వచ్చింది.

పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా మన దేశానికి పొగాకు తీసుకొని వచ్చినాడనీ, అంతకు ముందు మన దేశవాసులకు పొగాకు సంగతి తెలియదని, ఒక వదంతి మాత్రం ఉన్నది.

కాని ఈవిషయం అంగీకరించడానికి ఏమాత్రమూ వీలువడదు. మన ప్రాచీన గ్రంథాలలో ఈ చుట్ట ప్రశంస వచ్చినది కాబట్టి చుట్ట తాగడము చాలా ప్రాచీనమైన ఆచారముగా మనము అంగీకరించవలసి ఉంటుంది.

భీముడు చుట్ట తాగేవాడని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పవచ్చును. భారతములోనే కావలసినంత సాక్ష్యము దొరుకుతుంది.

విరాట పర్వంలో అన్నాడు "మొలమోపి పెక్కు చుట్టల్ వల త్రాటం జుట్టి గోప భావం బమరన్" అని.

భీముడు క్షణక్షణానికీ చుట్టుకోలేక చాలా పెద్దవైనవినీ, బరువైనవినీ అయిన చుట్టలు ఎక్కువగా ఒకేసారి చుట్టుకొని వాటిని చాలా త్రాళ్ళతో బిగించి, ఒకచోట పడేసి ఉంచుకొనేవాడు, కావలసినప్పుడల్లా ఒకటో రెండో తీసి కాల్చుకొనేందుకు.

"కోప భావం బమరన్" అని ఎందుకు అనవలసి వచ్చిందీ అంటే,

"....వెధవ చుట్టలు చుట్టీచుట్టీ ప్రాణం విసిగిపోయి, చివరకు తన మీద తనకే కోపం వచ్చింది" అని చెప్పవచ్చు. లేకపోతే ఇంకొక విధంగా చెప్పవచ్చు. పాండవులు అజ్ఞాత వాసంలో ఉన్నారు. వారంతా విరటుని కొలువులో ఉన్నారు. అప్పుడు తీరిక సమయంలో ఎప్పుడో భీముడు ఈ చుట్టలు చుట్టుకొని, "మహా

రాజునై యుండికూడా ఎంతగతి పట్టిందివాడు. చుట్టకు చుట్ట ఇచ్చేందుకు ఒక్క సేవకుడైనా లేకపోయెను, గదా!" అని వాపోయినాడు అని చెప్పినా చెప్పవచ్చు.

సాహిత్యంలోనే ఇంకో నిదర్శనం చూపిస్తాను. చుట్ట సంగతి మనవాళ్ళకు తెలుసును అంటావికి.

"ఎంచక నా గమనమునకు నించుక చుట్టయిన కానిమ్ము" అని కళాపూర్ణోదయంలో ఉన్నది. కళాపూర్ణోదయుడే ఈ మాట అని ఉంటాడు, ఏమనీ అంటే, ఈ ప్రయాణంలో నాకు ఒక చుట్టఅయినాసరే ఇయ్యవలసిందీ, అనీ!

"చుట్ట అయిన కాని యిమ్ము" అంటే "ఒక్క చుట్టముక్క అయినా ఇయ్యవయ్యా" అన్నమాట.

అంటే ఆ కళా పూర్ణోదయుడు చుట్టేతరంకూడా త్రాగేవాడని ప్రాకరణికార్థం. అది ఏదో మనము ఇప్పుడు ఊహించలేము.

ధర్మరాజు ఒకసారి ఏదో ప్రసంగంలో చుట్ట అంటే ఎవరికీ కోపం రాకూడదు అని చెబుతూ, "చుట్టయును పగయును భేదం బెట్టి జనులకు తగదు" అన్నాడు. చుట్ట త్రాగేవాడు కాకపోతే దానిని అంతగా వెనకేసుకురాడు.

కాటూరు వెంకటేశ్వరరావుగారు పడుకొనబోయేముందు రెండు మూడు చుట్టలు చుట్టుకొని, ప్రక్కనున్న బల్లపై పెట్టుకొని నిద్రపోయేవారు "పడుకోబోతూ ఉంటిరి-ఇప్పుడు త్రాగరుకదా! ఎందుకండీ చుట్టలు చుట్టుచున్నారు?" అని అడిగాను.

"రేపు ప్రొద్దున నిద్రలేవడంతోనే కావాలయ్యా. అప్పుడు చుట్టుకోసం అంటే బద్ధకంగా ఉంటుంది. అందుకని ఇప్పుడే చుట్టలు చుట్టుకొని ప ంటాను' భూభారాన్ని మోసే ఆదిశేషువుకూడా ఇల్లాగే చేస్తాట్ట! 'చుట్ట చుట్టకొని పరుండె. అని భాగవతంలో ఉన్నది" అన్నారు

"విష్ణుమూర్తికి 'చుట్టవాలుజోదు' అని పేరు ఎందుకు ఉన్నది?" అని అడిగితే ఏమి సమాధానం చెపుతారు? ఏదో పోనీలే అని ఊరుకుంటూ ఉన్నా కాబట్టి సరిపోయిందికానీ; అసలు చుట్టతో ఆయనకు ఏమి సంబంధం? ఎందుకు గ్రంథంలోకి దిగడం: ఆయన చుట్ట త్రాగేవాడని తెగేసి చెప్పి ఊరుకుంటాను.

అయితే శ్రీ విష్ణు పాదారవింద సేవకులూ, శ్రీ ఏడుకొండల వేంకటరమణుని భక్తులూ మొదలైన వారిచే సేవించబడే చుట్టలకు తిరుచుట్టలు అని పేరు. మనము తాగేవి మామూలు చుట్టలు. అంతే భేదం.

కాబట్టి భారతకాలం నాటికే చుట్ట తాగే అలవాటు మనకు ఉన్నట్టు తేలి పోయింది.

మరొక్క విషయముకూడా తెలుస్తుంది. గురుజనుల సమక్షంలోనూ, స్త్రీల యెదుటా చుట్ట తాగేవారుకాదని భారతంలో ఉన్నది.

ఎక్కడ ఉన్నదీ అనవచ్చు. తాగవచ్చునని ఎక్కడ ఉన్నది? తాగ వచ్చునని లేదుకాబట్టి తాగకూడదు. అనే ఉన్నట్లు మనము విధిగా భావించవలె. ప్రతి పక్షులకు అనుకూల దృష్టాంతము లేనప్పుడూ, మనము చెప్పినదానికి దృష్టాంత విరోధము లేనప్పుడూ స్వపక్షస్థాపన జరిగినట్లే భావించుట తర్క సమ్మతము. ఇతి తర్కః.

స్త్రీల సమక్షంలో చుట్ట తాగడం నిషేధమే అయినప్పటికి, ప్రియురాలితో ఏకాంతంగా ఉన్న సమయంలో చుట్ట తాగడము అనుపూర్వక సంప్రదాయముగా కనిపిస్తుంది. భార్య ప్రియుని దగ్గరకుచేరి తమలపాకుల 'చుట్టలు' ఇచ్చినట్లు అనేక చోట్ల వర్ణితము. పాండురంగమాహాత్మ్యంలో ఈ విషయము స్పష్టంగా చెప్పినాడు, "తనదు తొయ్యలి, వీడ్యము చుట్టయొసఁగ" అని ఉన్నది. భార్య తమలపాకులూ చుట్టకూడా ఇచ్చినట్లు చెప్పబడియున్నది.

బంధువులు, స్నేహితులు, వచ్చినపుడు భోజనాంతరం అందరికీ తలొక చుట్ట ఇయ్యడము ఇప్పటికీ మనలో అచారంగా యున్నది. ఈ ఆచారము భారత కాలంనాటికే ఉన్నదని ఊహించడానికి ఆధారాలు దొరుకుతున్నవి. శ్రీకృష్ణభగ వానులవారి యింటికి బంధజనులంతా వచ్చినారు. ఆ వచ్చినవారిలో పాండురాజు తనయులూ, ధృతరాష్ట్రుని కుమారులూ కూడా ఉన్నారు. శ్రీకృష్ణుడు మొదటినుంచీ పాండవులయందు స్నేహభావంతో ఉంటూ, ఆదరణ చూపిస్తూ, పక్షపాతం ప్రకటిస్తూ ఉండినారు.

ఒక సందర్భములో చుట్టలు ఇచ్చు సమయములో కూడా ఈ పక్షపాతమే ప్రదర్శించి, పాండుతనయులకు తలొక చుట్టయిచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు

అల్లాగ పక్షపాతంతో ప్రవర్తించటానికి కారణం ఊహించడమూ కష్టముకాదు. పైగాను ఆ రోజులలో చాలా ప్రియంగాఉండి సర్వజనలభ్యంగా ఉండేదికాదు. మహారాజులు మాత్రమే చుట్ట తాగేవారు. పాండవులు అయిదుగురు. ఆ అయిదు గురికి అయిదు చుట్టలు ఇయ్యడము అంత కష్టమైన పనికాదు. ధార్తరాష్ట్రులు నూర్గురు, అంతమందికి చుట్టలు ఇయ్యడము కష్టం. ఈకారణముచేతనో, లేక పాండవ పక్షపాతి కావడము చేతనో శ్రీకృష్ణభగవానులు పాండవులకు మాత్రము చుట్టలు ఇచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు. అప్పుడు భీష్మాచార్యుడో కృపాచార్యుడో అంటాడు- "పాండవులనుధార్తరాష్ట్రులు పుండరీకనేత్ర చుట్టరికంబున నీకు నీకు నొక్కరూప" అంటాడు.

"హే మహానుభావా, కృష్ణా! పాండవులు, ధార్తరాష్ట్రులు అనే భేదం ఉండ కూడదు. చుట్టరికంబున అనగా చుట్టలు పంచియిచ్చే విషయంలో అందరూ నీకు ఒక్కరూప, అందరూ సమానులే సుమా!" అంటున్నారు ఆ ఆచార్యులవారు, చుట్టకు సంబంధించిన స్నేహమే చుట్టరికమని ముందు నిరూపిస్తాను. ఆచార్యుల వారితో సంబంధం ఉన్నది. కాబట్టి అవి తిరుచుట్టలే అయివుంటవి.

చుట్ట తాగడము ప్రధానంగా రాజుల పరంగానే కనబడుతుంది గాని సామా న్యుల విషయంలో అంత వ్యాప్తిలో ఉన్నట్లు కనబడదు. ధర్మరాజు నిర్మించిన మయసభ సంగతి చెప్పే సందర్భంలో సభాపర్వంలో, సామంతరాజులు చుట్టు కొనిరి"- అని ఉన్నది. "ఏమిచుట్టి ఉంటారు?" చుట్టలే చుట్టుకొని ఉంటారు- ప్రాకరణి కార్థము.

ఇల్లాగ భారతంలో ఎక్కడచూచినా చుట్టలసంగతి బహుళంగా ఉన్నది.

ఇంకొక సంగతి జ్ఞాపకం వచ్చింది. విష్ణుమూర్తికి చుట్టలంటే మహా ఎక్కువైన ప్రీతిఅని చెప్పటానికి రెండు మూడు నిదర్శనలు కనబడుతున్నవి. విష్ణువుకు శంఖచక్రాలు ఉన్నవి అన్నది అందరికీ తెలిసిన విషయమే.

శ్రీరంగనాధుడికి చుట్టయందు ఉంచుకున్నటువంటి ప్రేమవల్లనే తన శంఖ మునకు 'చుట్టుగుల్ల' అని పేరు పెట్టుకొన్నాడు. చుట్టుగుల్ల అన్నా చుట్టగుల్ల అన్నా ఒకటే అర్థము. అల్లాగే తన చక్రాయుధానికి చుట్టుగయిదువు అదికూడా ముద్దుపేరు.

అసలు ఆయనకే చుట్టువాలుదారి, చుట్టువాలుజోదు అనేపేర్లు ఉన్నవి, చుట్టకే రూపాంతరము చుట్టు చుట్టబడినవి. కాబట్టి చుట్టు-పెట్టు తిట్టు, కుట్టు, మొట్టు. శబ్దంబులవలె ఏర్పడినది.

పూర్వకాలంలో రాజులకోసం చుట్టలు తయారు చేయడానికి ప్రత్యేకంగా ఒక ఇల్లు ఉంటూ ఉండేది. దానినే చుట్టిల్లు అనేవారు. చుట్టలు చుట్టడానికే ఏర్పడ్డ ఇల్లు 'చుట్టిల్లు' అయింది, ఇది నట్టిల్లువంటి శబ్దము. నడు + ఇల్లు నట్టిల్లు అయినట్లే, చుట్ట + ఇల్లు చుట్టిల్లు అయింది.

చుట్టలు తాగేవారు ఇద్దరు కలియడముతోనే వారిద్దరికి ఇట్టే స్నేహము కుదిరిపోతుంది. ఆ ఇద్దరిలో ఒకరు చుట్టచుట్టుకొనే నోరువిప్పి ఏమాటా అనకుండానే రెండవవానివైపు చెయ్యిచావడముతోనే, ఆ రెండవ మనిషి విప్పుపెట్టె తీసి అతని చేతిలో పెడతాడు.

సాధారణంగా మొదటి పెద్దమనిషి రెండుచుట్టలు చుట్టి పక్కనున్న పెద్ద మనిషికి ఒకటి ఇయ్యడమే ప్రాకటము.

ఇల్లాగ చుట్టసంబంధంగా ఇద్దరు మనుష్యుల మధ్య ఏర్పడిన సంబంధమే చుట్టరికము అయినది ఇదే చుట్టరిక శబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థము.

ఈ వ్యాపారం ప్రాచుర్యంగా బంధువులమధ్యనే జరుగుతూవచ్చిన కారణాన చుట్టరికం అంటే బంధుత్వము అనే అర్థము స్థిరపడిపోయి రూఢము అయింది.

దీనినే సముదాయార్థము అని కూడా అంటారు. ఇప్పటికే చుట్టము అంటే బంధువు అనే అర్థమేకాకుండా స్నేహితుడు అనే అర్థముకూడా ఉన్నది.

చుట్ట, పొగ అనే మాటకు తర్కశాస్త్రంలో ఉన్న సంబంధముచూస్తే, చుట్టయొక్క ప్రాశస్త్యమేకాక తర్కశాస్త్రమును రచించిన గౌతముడూ, వాత్స్యాయనుడూ, దిఙ్నాగాచార్యులవారూ, గంగేశోపాధ్యాయులూ మొదలైనవారు చుట్టా, పొగా. ఈ రెండిటికిని గల సంబంధమును బాగా గుర్తించినవారు అని స్పష్టంగా బోధపడుతుంది.

తర్కంలో అనుమాన ప్రమాణవాదము అనబడే ఒక వాదము ఉన్నది. ఆ వాదన ఇల్లాగ ఉంటుంది. "ఎక్కడ ధూమము ఉన్నదో అక్కడ అగ్నిఉన్నది, ఇక్కడ ధూమము ఉన్నది కాబట్టి ఇక్కడ అగ్ని ఉన్నది." ఈ వాదనేఇంగ్లీషులో 'సిలోజిజమ్' అంటారు.

ఈ రకము వాదనకు ప్రమాణం నాచే వ్రాయబడిన 'విచిత్రతర్కం' చూడ నగును. "ఎక్కడెక్కడ ధూమము ఉన్నదో అక్కడక్కడల్లా అగ్ని ఉన్నది అన్నది హేతువాక్యము.

ఆ హేతువాక్యమే దోషయుక్తము అయితే వాదము దోష భూయిష్ఠము అవుతుంది. హేతునిర్ణయము చేయడంలోనే తార్కికుని ప్రతిభ ప్రదర్శితము అవుతుంది. అందుచేత తార్కికుడు హేతుసృష్టికోసమూ, వైయాకరణి ధాతుసృష్టి కొరకూ చూస్తూ ఉంటారు.

ఆ సంగతి అల్లాగఉంచి ప్రకృతానికి వద్దాము.

ఇప్పుడు పైనచెప్పిన వాదనలో హేతుపుష్టి ఉన్నది. ఎందుచేతనూ అంటే పొగఉన్న చోటల్లా అగ్ని ఉంటుంది అన్నవిషయాన్ని కాదని ఎవరూ అనలేరు.

కొంచెము తార్కిక పరిభాషలోకి వెళితే ధూమానికీ అగ్నికి నియత సంబంధము ఉన్నది. అనిఅంటారు, ఆ రెండూ ఎప్పుడూ కలిసిఉంటవి. పొగ ఉన్నదీ అంటే, అగ్నిఉన్నదన్నమాటే. అందుకనే 'యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః' అని చెప్పాడు శాస్త్రకారుడు.

పై హేతువాక్యాన్ని తార్కికుడు ఎట్లా నిర్మించగలిగినాడూ? అనిప్రశ్న. 'చుట్ట త్రాగడాన్నిచూసి' అని జవాబు వచ్చినట్లు చెప్పితీరాలె - ఇంకో మార్గంలేదు. ఎందుకంటే, ఆ నియత సంబంధం ఒక్క ఈ విషయంతోనే అనుమానానికి అవకాశంలేని పద్ధతిలో కనిపిస్తుంది. చుట్టలో అగ్నిఉంటె నోట్లోనుంచి ధూమము వస్తుంది. అగ్నిలేకపోతే ధూమంరాదు. యత్ర యత్ర వహ్నిరాస్తి తత్ర తత్ర ధూమోఽపినాస్తి.

అయితే "చుట్ట కాల్చుచుండగా ధూమము వచ్చుటయూ అచ్చట అగ్నియూ ధూమమును కలిసియుండుటయూ మేము చూచితిమి" అని యా తార్కికులు ఒప్పుకోరు ఒప్పుకోక 'యత్రధూమస్తత్రాగ్నిః యథా మహానస' అంటారు. ధూమమూ అగ్ని వంటయింటియందు నియత సంబంధముతో ఉన్నవి అని అన్వయ దృష్టాంతము ఇస్తారు.

ఇల్లాగ అనడము కేవలము చుట్టయందు వ్యతిరేక భావము ఉండడమువల్లనే కాని మరొకటి కాదు. చుట్టకు ఈ విధంగా అన్యాయం జరిగింది తార్కికుల చేతులలో.

ఈ కారణముచేతనే ఈనాటికి తర్కం చదువుకొన్న వారికి చేతిలో చుట్ట ఉన్నట్టుకాలదు. ఈ విషయం నిజమో అబద్ధమో తెలుసుకోవలెనంటే జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని- తిరువెంగళాచార్యులు గారిని అడుగవచ్చు.

నిజానికి ధూమానికి, అగ్నికి ఏకాంతిక సంబంధం మహానసములో ఛస్తే కుదరదు. అక్కడి సంగతి మా శాంతాన్ని అడిగాను. ఏమిటి నిజంసంగతి చెప్పు, ధూమము ఉన్నచోట్లనెల్లా అగ్ని ఉంటుంది అంటాడు న్యాయదర్శన గ్రంథకర్త. అది నిజమేనా?" అని.

తర్కశాస్త్రం రచించిన గౌతముడే కానీ ఆ గ్రంథాన్ని తెలిగించిన వెంకట రమణశాస్త్రిగారే కానీ ఎవరైనాసరే. ఈ ధూమాగ్నుల మధ్యనున్న సంబంధం విషయంలో కాంతం చెప్పినదానికి కటిక్కన తలవంచవలసిందే గాని కాదంటానికి వీలులేదు. ఈ విషయంలో ఆమె నిర్ణయము ప్రమాణవాక్యము. దానికి విప్రతిపత్తి లేదుకాబట్టి ఆమె వాక్యం సర్వతంత్ర సిద్ధాంతముగా అనగా ఇతర శాస్త్రములకు వైరుధ్యంబు లేనిదానినిగా అంగీకరింపక తప్పదు.

"అనేకసార్లు ఊరికే పొగరాజుతుందేగాని నిప్పురాజదు ఎప్పుడైతే నిప్పు రాజి అగ్ని ఏర్పడుతుందో అప్పుడు పొగఉండదు" అని ఆమెగారు తెగేసిచెప్పింది.

మహానసములో ధూమాగ్నులమధ్య నియత సంబంధంలేదు. ఒక్కచుట్ట కాలుస్తున్నప్పుడే ఎల్లవి నిప్పూ పొగా కలిసిఉంటవి.

కాబట్టి యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః అన్నవాక్యం చుట్టు దహన సంస్కారాన్నిచూచే అవబద్దది గౌతముని కాలంనాటికి చుట్ట కాల్చడము మిక్కిలి వ్యాప్తిలోఉంది అనేది సిద్ధాంతము.

అభ్యుదయ రచయితలు అన్నట్లు ఆ కాలంలో రాజులను సంతోషపెట్టడానికే సకలశాస్త్రిలూ, కావ్యాలూ పుట్టినవి కాబట్టి రాజులు చుట్టకాల్చడానికి సంబంధించిన ఈ వాక్యం తర్కశాస్త్రంలోకి ఎక్కింది కాబట్టి ఇంతకూ తేలిన విషయము ఏమిటీ అంటే చుట్ట పంపిణీమీదే తర్కశాస్త్రం పుట్టింది అని. ఉదాహరణలలో మహానసములోవలె అని చెబుతారు తార్కికులు. అల్లాఅనక యత్రధూమస్తత్రాగ్నిః యథా దహనసంస్కార వైఖరి అని ఉండాల్సింది.

సాధర్మ్య నిరూపణ ఇల్లాగ చుట్టకు సంబంధంగా ఉండకపోవడానికి కారణము కూడా మనము ఊహించవచ్చు. మొదట్లో రాజులకు సంబంధించిన తర్కశాస్త్రంలోకి ఎక్కించారు. కాని తరువాత రాజుల ప్రతిభ తగ్గింది. బ్రాహ్మణుల ప్రాబల్యం వచ్చింది. చుట్టత్రాగడము రాజులలో ఉండేదని చెప్పాను వారు క్షత్రియులు. అనగా బ్రాహ్మణేతరులు. బ్రాహ్మణేతరుల ఆచారాన్ని పేర్కొని

దానికి తర్కశాస్త్రంలో ప్రాధాన్యము ఇయ్యడము, తర్కశాస్త్ర గ్రంథకర్తలైన బ్రాహ్మణులకు ఇష్టంలేకపోయి ఉంటుంది. అందుకే తమకు ఇష్టమైన మహానస విషయము ఉదాహరణగా చేర్చినారు.

బ్రాహ్మణులవలన బ్రాహ్మణేతరులకు జరిగిన అన్యాయాలలో ఇది యొకటి.

ఇంక అలంకార శాస్త్రంలో చుట్టకు కావలసినంత ప్రమేయము ఉన్నది. అదిప్పుడు తేలేవిషయంకారు సంస్కృత వాఙ్మయంలో చుట్టప్రశంస కొద్దిగా ఉన్నదని చూపిస్తాను. కాళిదాసు మేఘసందేశంలో మేఘములు చుట్టలతో పోల్చబడినవి. మేఘములు చుట్టలు చుట్టుకొని గగనమార్గాన సంచరిస్తున్నవట!

ధూమజ్యోతి స్సలిల మరుతాం అన్నచోట ధూమప్రశంస వచ్చింది. కాబట్టి కాళిదాసుకు చుట్ట తాగడమూ, దానివలన పొగను పుట్టించడము అనే విషయాలు తెలిసే ఉండాలె.

చుట్ట తాగడములో రెండు విశిష్టమైన పద్ధతులున్నవి. చక్కని ఒక పేటికలో కొన్ని చుట్టలనుపేర్చి దానినీ, ఒక నిప్పుపెట్టెనూ, పక్కనున్న గుండ్రని బల్లపై పెట్టి ఒక పడకకుర్చీలో శయనించి ఠీవిగా చుట్టను ముట్టించి ఆప్యాయంగా ధూమపానం చేయడము ఒక పద్ధతి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ పద్ధతిలో చుట్ట కాలుస్తారు.

అరుగుపైనగాని లేక మరొక చోటగాని చాపపై నడ్డిగంవేసి కూర్చుని చుట్ట తాగడము మరొక పద్ధతి. కాటూరువారు ఈ పద్ధతిలో చుట్ట తాగుతారు.

ఈ రెండవ పద్ధతిలో కూడా ఠీవి, రాజసము, హుందాతనము, సరళత, స్నేహభావమూ, మొదలైన సుగుణాలు ప్రదర్శితము కావడానికి అవకాశాలు ఉన్నవి.

చక్రవాకములు సూర్యునియందు, చకోరికలు చంద్రునియందు, తుమ్మెదలు పుష్పాల గుత్తియందు ఎలాంటి అనురక్తి కలిగిఉన్నవో అలాగే కవులు కూడా కాటూరివారి చుట్టతాగే పద్ధతియందు అనురక్తి కలిగియున్నారు.

చుట్ట, బీడీ, సిగరెట్టు అనేవి ఉపాధిభేదంచేత వేరు వేరు వస్తువులుగా కనపడుతూ ఉన్నప్పటికీ వానిలో ఉపహితమైయున్న మూలపదార్థము ఒక్కటే.

ఒకటే పరమాత్మ పదార్థము త్రిమూర్త్యాకారమును పొందినట్లే, ఇదీనూ. ఈ మహదర్థమును ఎఱిగిన కారణాన పండితులూ కవులూ అయినవారూ ఈ

త్రిమూర్తులనూ సేవిస్తూ ఉంటారు. ఎట్లాగయినా ఈ త్రికములో పర్వతాలలో మేరువువలె, శిఖరాలలో కైలాసములాగ, సముద్రాలలో క్షీర సముద్రమురీతి. యశోవైభవము కలిగి జగద్వ్యాపకమైన కీర్తిని కలిగియున్నది ఒక్కచుట్ట అనే చెప్పవలసి వస్తుంది.

చుట్ట తాగడమువలన అనేక ప్రయోజనములు సిద్ధిస్తూఉన్నవి. రాజకీయాలలో శేముషీధురంధరుడైన చర్చిల్ చుట్ట తాగడమువల్లనే అసమానమైన ప్రజ్ఞను సంపాదించినట్లు జగద్విదితము.

దేవులపల్లి, కాటూరి ప్రభృతులు చుట్టతాగుతూఉన్న కారణానే, మహాకవులైనట్లు మనము ఊహించవచ్చును.

చుట్టను ముట్టించి విలాసంగా పొగనువదలి, వర్తులాకారమైన చిన్న చిన్న మేఘమండలాన్ని సృష్టించగా అవి మంద మంద గతిని ఆకాశంలో విహరిస్తూ ఉంటే, పంక్తులుగానిలిచిన బలాకములవలెనూ. బిసకిసలయములను పాథేయముగా గొని మేఘువివెంట కైలాసమునకై పోవుచున్న రాజహంసలవలెను కనిపిస్తవి.

అదీకాక, అషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్ట సానుం వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయందదర్శ అనే శ్లోకపాదం కూడా జ్ఞాపకం వస్తుంది.

చుట్ట మనస్సుకు కలిగిన వ్యాకులతను పోగొడుతుంది.
అలసటను తీరుస్తుంది.
దాహాన్ని ఉపశమింపజేస్తుంది.
విరహార్తులను శమింపజేస్తుంది.

చుట్ట తాగడమువలన కలిగే ఆనందము, మధురమైన కావ్యమును చదివినపుడూ, ప్రియురాలు బుగ్గపై చిటికవేసి సరసోక్తులు ఆడేటప్పుడూ కలిగే ఆనందముతో సమానమైనది అని చెప్పవచ్చును.

కోపము, ద్వేషము, వంటి మనోవికారాలను పోగొట్టటానికి చుట్టవంటి వస్తువు ఇంకొకటిలేదు.

మిత్రునివలె ఆదరించేది, ప్రియురాలివలె లాలించేది, తల్లివలె బుజ్జగించేది ఒక్క చుట్టేకాని మరొకటి కాదు.

ఈ వ్యాపారము ఒక్కటే పీయూషపానమువలె మధురమైనదీ, శరద్రాత్రివలె మనోహరమైనదీ అయిఉన్నది.

కాబట్టి మనము అందరమూ కూడా ఈ చుట్టకు పరిణత శిరస్కులముకాక తప్పదు.

చుట్ట యొక్క మాహాత్మ్యమునూ, పరువమునూ, ప్రయోజనమునూ, గుర్తింపని కొందరు నాస్తికులు, దానిని గురించి అపభాషణచేస్తూ ఉండటము చాలా శోచనీయము.

"హే చుట్టే అహం త్వాం ఉపాసే
తమసోమా జ్యోతిర్గమయ"

గమనిక:

పాఠము 'సర్వాయిపావడు' 14వ పుటలో 13వ లైనులో 'తనరాక' అను పదములతరువాత ఈ క్రింది భాగమును చేర్చుకొని చదువవలయును.

తనరాక "పట్టణములోని వారికి తెలియకుండుటకై"

# పాఠ్య పరిచయాదులు

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

### 'కవుల కష్టములు'

ఈ వ్యాసము శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన "సాక్షి" రెండవ సంపుటము నుండి గ్రహింపబడినది. గ్రంథకర్త ఈ వ్యాసములను ఆరు సంపుటములుగా ప్రచురించినారు. వీరికి సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషలలో విశేషమైన పాండిత్యమున్నది పిఠాపురం మహారాజావారి వద్ద ఆస్థాన కవులుగా ఉండెడివారు. హాస్యరస ప్రధానమైన ప్రవృత్తి వీరిది. వీరి రచనలన్నింటిలోను ఇది కనిపించుచుండును. వీరు పౌరాణిక, చారిత్రిక, కల్పిత నాటకములెన్నియో రచించిరి. వానిలో "రాధాకృష్ణ" "కంఠాభరణము" సుప్రసిద్ధములు.

ఎడిసన్ అను ఆంగ్లకవి వ్రాసిన "స్పెక్టేటర్" రచనా విధానము వీరిని ఆకర్షించినది. ఆ పద్ధతిలో "సాక్షి" ఉపన్యాసములను వ్రాసి ఆంధ్ర పత్రికలో వరసగా కొంతకాలము ప్రకటించినారు. సాంఘిక దురాచారములను, పాశ్చాత్య నాగ కతా వ్యామోహమును, నీతిబాహ్యమైన నడవడిని వ్యంగ్య మర్యాదతో ఎత్తిపొడుపు మాటలతో సునిశితముగా విమర్శించుట వీరి ప్రత్యేకత, వీరు వచన రచనలో కూడ ఒక విశిష్టమైన మార్గమును, శైలిని సంతరించుకొనినారు. ఆంధ్ర వచన వాఙ్మయములోనే "సాక్షి" ఉపన్యాసములకు సముచితమైన స్థానమున్నది-సమున్నతమైన గౌరవమున్నది ఇందులోని జంఘాలశాస్త్రి, వాణీదాసు, కాలాచార్యుడు కేవలము కల్పిత వ్యక్తులు. సంస్కృత సమాసములు వాడినను సరళ సుందరమైనది వీరి వచన రచన.

ప్రస్తుత పాఠ్యభాగములో శ్లేషలతో బంధకవితా రచనలతో పనికిమాలినపద్యములను రచించుచు తమకి దేశములో సరియైన గౌరవము లభించుటలేదని వాపోవుచు ప్రభువులను దేశమును నిందించెడు వారిని అధిక్షేపాత్మకముగా విమర్శించుట కానవగును. ఈ సందర్భములో యూరోపు దేశములలో పేరొందిన మహాకవులు పడిన పాటులను వారి ఆర్థిక దుస్థితిని ఉదహరించినారు. ఈ విషయములో ఆ కవులకన్న మన కవులే అదృష్టవంతులని ఉద్ఘాటించినారు. మన దేశ ప్రభువులు ప్రజలు కవులను సమాదరించిన విధమును వివరించినారు

# శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

## 'సర్వాయి పాపడు'

ఈ వ్యాసము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "అమరావతీస్తూపము" అను చారిత్రిక వ్యాససంపుటము నుండి గ్రహింపబడినది. "అనాదృత వాఙ్మయము" అను వ్యాసములో శ్రీ శర్మగారు శిష్టుల ఆదరణ భాగ్యమునకు నోచుకొనని జానపద సాహిత్య ప్రాముఖ్యము గురించి వ్రాసినారు. ఈ సందర్భమున పల్లెపట్టులంతట పాటల రూపములో వ్యాప్తియందున్న సర్వాయి పాపని సాహసగాథకును మహమ్మదీయులు వ్రాసిన చరిత్రలోని కథకునుగల వైరుధ్యము గురించి చర్చించి చారిత్రిక యాదార్థ్యమునూహించినారు.

శ్రీ శర్మగారు సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు. కొమర్రాజు లక్ష్మణరావు చిలుకూరి వీరభద్రరావుగారల అడుగుజాడలలో నడిచి మరుగుపడిన చారిత్రిక స్వర్ణయుగాల నెన్నింటినో వీరు వెలుగులోనికి తీసికొని వచ్చినారు. ఆంధ్రదేశ చరిత్ర గురించి బౌద్ధయుగ చరిత్ర గురించి విశేషమైన కృషిచేసినారు. అమూల్యమైన పరిశోధన వ్యాసముల నెన్నింటినో ప్రచురించినారు. శాసన పరిశోధకులుగను భాషా పరిశోధకులుగను వాసికెక్కినారు.

వీరి రచనలలో A Forgotten Chapter of Andnra History, The History of the Reddy Kingdomes వంటి చారిత్రిక గ్రంథాలు తలమానికములు.

కొమర్రాజు లక్ష్మణరావుగారు చేపట్టిన "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము" రచనలో వీరి తోడ్పాటు కలదు. తెలుగు భాషాసమితివారు ప్రకటించిన సంస్కృతి గురించిన సంపుటముల రచనలో వీరు ముఖ్యులు.

శర్మగారి వచన రచన ఒక విశిష్టమైన శైలి కలది. ప్రాచీన భారతవర్ష వైభవమును వర్ణించు పట్టులలో ఒడలు పులకరించునట్లు వీరు రచన సాగింతురు. ఆవేశోత్సాహములు జనించునట్లు రచన చేయుటలో శర్మగారి కలము ఉరకలు వేయును. తెలుగు భాషలో ఇముడగలిగిన సంస్కృత పదములతో కూడిన సరళ గ్రాంథిక వచన రచన వీరిది.

వరంగల్లు జిల్లాలోని జనగామ తాలూకాలో ఖిలాషాహపురమను గ్రామము న్నది. ఇక్కడ సర్వాయిపాపనిచే నిర్మింపబడిన ఖిలా ఉన్నది. ఖిలా అను ఉర్దూ పదమునకు దుర్గమని అర్థము. ఖిలా ఉన్న షాహపురము కనుక ఖిలాషాహపురముగా

ప్రసిద్ధిగాంచినది. ఔరంగజేబు అవసానకాలములోను ఆ తరువాత వచ్చిన కాంబక్ష్ కాలములోను ఈ సర్వాయిపాపడు విజృంభించి మొఘలు సామ్రాజ్యమును గడగడ లాడించినట్లు తెలియవచ్చుచున్నది. అనగా 18వ శతాబ్దపు పూర్వభాగములో నీత డున్నట్లు ఊహింపవచ్చును. బందిపోటు దొంగగా మహమ్మదీయ చరిత్రకారులు చిత్రించిన సర్వాయిపాపడు నిజమైన హైందవవీరుడుకాని వట్టి దొంగ కాదని యీ వ్యాసమున చెప్పబడినది.

కుల్పాల్–కొలనుపాక (కొల్పాక) ఆలేరు రైల్వేస్టేషనుకు సుమారు 8 కిలోమీటర్ల దూరములోనున్న చారిత్రక ప్రాధాన్యముగల గ్రామము. ఇక్కడ ప్రాచీన జైన దేవాలయమున్నది ఎన్నో శాసనములు కలవు.

తాటికొండ–తాటికొండ వరంగల్లు తాలూకాకు చెందిన గ్రామము ఘనపురము రైల్వేస్టేషనుకు సుమారు 5 కిలోమీటర్ల దూరములో నున్నది. ఇక్కడ గుట్టపై సర్వాయి పాపని కోట గలదు.

హుసనాబాదు–కరీంనగరం జిల్లాలోని తాలూకా కేంద్రము.

# శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

## 'తానాజీ మాలుసురే'

ఈ వ్యాసము శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి "హైందవ ధర్మవీరులు" అను గ్రంథమునుండి గ్రహింపబడినది. ఈ గ్రంథములో ప్రముఖ హైందవ జాతీయ వీరుల సాహసగాథలు తేట తెలుగుభాషలో రచింపబడినవి. విషయ వైశద్యము కలిగిన సులభ గ్రాంథికములో రచించుట శ్రీ రెడ్డిగారి ప్రత్యేకత. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రామాయణ విశేషములు, హిందువుల పండుగలు వంటి గ్రంథములు, వీరి పరిశోధనా పాటవమునకు మచ్చుతునకలు. పరిశోధనారంగములో వీరిదొక క్రొత్తమార్గము. సంఘ జీవిత చరిత్రను ప్రదర్శించుచున్న గ్రంథము వీరి ఆంధ్రుల సాంఘిక చరిత్ర. దీనికి కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించినది.

వీరు "గోలకొండ పత్రిక"కు చాలకాలము సంపాదకులుగా వ్యవహరించిరి. "గోలకొండ కవులసంచిక" అను గ్రంథమును రచించి నాటి నిజాం రాష్ట్రము

మొదలి తెలుగుకవుల చరిత్రను వెలుగులోనికి తెచ్చిరి. ఆనాటి తెలంగాణా కవుల చరిత్రకిది దర్పణమువంటిది. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనమందును, ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనమందును వీరు ప్రముఖపాత్ర వహించిరి. ఈ రెండు సంస్థలు నేటికీని దినదినాభివృద్ధి పొందుచు సాహిత్య సాంస్కృతిక రంగములలో ఎనలేని సేవచేయుచున్నవి. ఆంధ్రోద్యమము, సాంస్కృతికోద్యమము, గ్రంథాలయోద్యమమువంటి ఆనాటి జాతీయోద్యమములన్నింటిలో రెడ్డిగారు ప్రముఖపాత్ర వహించుచుండెడివారు.

ప్రస్తుత పాఠ్యభాగములో శివాజీకి కుడిభుజముగానున్న తానాజీమాలుసురే అను సేనానాయకుని సాహసగాథ హృదయావర్జకముగా వర్ణింపబడినది. సింహగఢ్ ముట్టడిలో తానాజీ కోటను స్వాధీనపరచుకొని వీర మరణము పొందినాడు. అట్టి మహావీరుని చరిత్రము ఇందు వర్ణింపబడినది.

# శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

## 'శ్రీకృష్ణదేవరాయల రాజనీతి'

'శ్రీకృష్ణ దేవరాయల రాజనీతి' అన్న వ్యాసము లక్ష్మీరంజన వ్యాసావళి'అను గ్రంథములోనిది. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, ఉస్మానియా విశ్వ విద్యాలయములో ఆంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసి విశ్రాంతులైనవారు. వారు అప్పుడప్పుడు రచించిన వ్యాసములు వారి షష్టిపూర్తి సందర్భమున ఈ వ్యాస సంపుటిగా వెలువడినవి.

ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రాంతములో ఆంధ్రభాషాబోధన విషయమున శ్రీ లక్ష్మీరంజనంగారి కృషి అసామాన్యమైనది. పరిశోధనలు ఈ శాఖలో ప్రారంభించి దాని పురోభివృద్ధికి కారకులైనవారు. ఆంధ్ర మహాభారతము పరిష్కృత ప్రతి ప్రయత్నమంతయు వారి కృషి.

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము వారి ప్రయత్నములే. సిద్ధేశ్వర చరిత్రమును పరిష్కరించి వారు ప్రకటించిరి. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము వారి యితర రచనలు తెలుగు దేశములో మొదటిసారిగా తెలుగు మీడియం డిగ్రీ కళాశాలను స్థాపించిన ఘనత వారిది. విస్తృతమైన విద్యావంశము.

శ్రీ లక్ష్మీరంజనంగారు రాయలు రచించిన ఆముక్తమాల్యద ఆధారముగా ఆతని రాజనీతినిగూర్చి వివరించినారు. యామునాచార్యుడు వైరాగ్యము పొందినవెంటనే రాజ్యమును తన కుమారునకప్పగించుచు రాజనీతినిగూర్చి విపులముగా నుపదేశించును. ఈ ఘట్టమునందు రాజైన రాయలు పూర్వ రాజనీతి గ్రంథములలోని అంశములనేకాక తన అనుభవమునుండి గ్రహించిన విశేషాంశములను గూడ చెప్పియుందురు.

ఈ వ్యాసము ప్రాచీన భారతీయ రాజ్యవ్యవస్థను వర్ణించుటతోబాటు రాయల నాటి సామ్రాజ్య పరిస్థితినిగూడ వెల్లడించుచున్నది.

రాయల విజ్ఞాన వైభవమునేకాక ఈ రచన ఆయన ప్రజాహిత చింతననుకూడ తెలుపును.

# శ్రీ దేవులపల్లి రామానుజరావు

## 'గ్రామాలలోని వేడుకలు- క్రీడా వినోదాలు'

ఈ వ్యాసము శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు రచించిన "సారస్వత నవనీతం" అను వ్యాస సంపుటమునుండి గ్రహింపబడినది. ఈ గ్రంథము ఆయా సందర్భములలో వారు వ్రాసిన వివిధ వ్యాసముల సంపుటి.

రామానుజరావు వరంగల్లు వాస్తవ్యులు. తెలంగాణములో సాగిన సాహిత్య సాంస్కృతిక ఉద్యమములన్నింటితో వారికి సంబంధమున్నది. గ్రంథాలయోద్యమములో పాల్గొని భాషాసేవ చేసినారు. ఒక పర్యాయము రాజ్యసభ సభ్యుడుగాకూడా ఉన్నారు. "గోలకొండ పత్రిక" సంపాదక మండలిలో కొంత కాలము పనిచేసినారు. వరంగల్లులోని శబ్దానుశాసన ఆంధ్ర భాషానిలయమునకు కార్యదర్శిగా ఉండి 1941 ప్రాంతములో వైభవముగా రజతోత్సవములు జరిపించినారు. వరంగల్లునుండి 1947 ప్రాంతములో "శోభ" అను మాస పత్రికను నడిపినారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు అభ్యున్నతికి వీరు చేసిన కృషి ఎనలేనిది. దానికిప్పుడు వీరు ఉపాధ్యక్షులుగా ఉన్నారు. వరంగల్లులో కాకతీయ విశ్వవిద్యాలయము స్థాపింపబడుటకు వీరు విశేషమైన కృషిచేసినారు. హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి రెండు దశాబ్దములకు పైబడి కార్యదర్శిగా ఉండి తెలుగుభాషా సాహిత్యముల ప్రగతికి పాటుపడినారు. దీనికిప్పుడు ఉపాధ్యక్షులుగా

ఎన్నికైనారు. ఉద్యమకర్తగా, గ్రంథకర్తగా వాసికెక్కిన బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆంధ్ర, ఆంగ్ల, ఉర్దు భాషలలో పాండిత్యము కలవారు.

పచ్చతోరణము (ఖండకావ్య సంపుటి), సాంస్కృతిక పునరుజ్జీవనము, తెలంగాణాలో జాతీయోద్యమాలు సాహిత్యోపన్యాసాలు వంటి గ్రంథములు రామానుజరావుగారి ప్రజ్ఞకు గీటురాయివంటివి.

వీరి వచన రచన ఎగుడు దిగుడులులేక మిక్కిలి సరళముగా నుండును. భాషగ్రాంధికమునకును, వ్యావహారికమునకును మధ్యేమార్గముగా సాగును.

ప్రస్తుత వ్యాసములో తెలుగు సీమలోని గ్రామములలో నిన్నమొన్నటివరకు వ్యాప్తిలోనున్న ఆటపాటలగురించి, వినోదములగురించి వివరముగా వ్రాసినారు. గ్రామీణ వాతావరణము కన్నులకు కట్టునట్లుగా ఇందులో వర్ణింపబడినది.

# శ్రీ కొడవగంటి కుటుంబరావు

## 'నేనే కవినైతే'

ఈ వ్యాసము కొడవగంటి కుటుంబరావుగారి "సాహిత్య ప్రయోజనం"— వ్యాసావళినుంచి తీసికొనబడినది. మొదట ఈ వ్యాసము ఆలిండియా రేడియోనుండి ప్రసారితమైనది. ఈ గ్రంధములో కుటుంబరావుగారు ఆయా సందర్భములలో ప్రచురించిన వ్యాసములు సంకలితము చేయబడినవి.

కుటుంబరావుగారు గొప్ప కథకులు, నవలాకారులు, విమర్శకులు, కథాకథన శిల్పజ్ఞులు— వీరి "చదువు"అను నవలకు బహు జనాదరణ లభించినది. వీరి రచనలలో సామాజికస్పృహ, సామ్యవాద దృక్పథము, మానవతావాదము ముప్పేటలుగా పెనవేసికొని కనిపించును. కుటుంబరావుగారివలె జీవితమును లోతుగా సునిశితముగా దర్శించగలిగిన రచయితలు మనకు తక్కువ.

వచన రచనలో వీరిదొక ప్రత్యేకమైన శైలి. నిత్య వ్యవహారములోని వ్యావహారిక పదజాలముతో ప్రసన్నమైన ధారశుద్ధిని వీరి వచనము సంతరించుకొన్నది. చిన్నచిన్న వాక్యములతో గంభీరమైన అర్థస్ఫూర్తిని కలిగించుటలో కుటుంబరావుగారు అసమానులు.

ఆంధ్ర పత్రిక సంపాదక మండలిలో కొంతకాలము పనిచేసినారు. సినిమాలకు స్క్రిప్టువ్రాసినారు. "చందమామ" పత్రికలో చిరకాలమునుండి పనిచేయుచున్నారు. మదరాసులో పాత్రికేయులుగా స్థిరపడినారు.



ప్రస్తుత పాఠ్యభాగములో రచయిత కవిత్వ మూలపదార్థములను గురించి ప్రస్తావించినారు. కేవలము గణ యతి ప్రాసలతోకూడిన పదముల కూర్పు కవిత్వముకాదని సోదాహరణముగ వివరించినారు. చిత్ర, బంధ కవిత్వముల గారడీ రచనలు కవిత్వము కాజాలవని విస్పష్టముగా ప్రకటించినారు. అచ్చమైన కవిత్వ మెట్లుండునో ఉదాహరణ పూర్వకముగా నిరూపించినారు.

47 పుట: "చరణ....లలంబే= అస్తాద్రినితంబమునందు చంద్రబింబము వేలాడుచున్నది.



'యువతి ... బింబే'=ప్రియులు చుంబించివిడిచిన పెదవులుగల యువతి జన సమూహమునందు.



"భోజనం-సమన్వితమ్"= ఓ మహారాజా, పప్పు నేతితోగూడిన భోజనము పెట్టుము.

"మాహిషం....దధి"= శరత్కాలమందలి వెన్నెలవలె ధవళమయిన గేదె పెరుగునుకూడ సమకూర్చుము.

దివా....భీతా....పగటిపూట కాకి అరుపునకే భయపడు స్త్రీ.

రాత్రౌ... నర్మదామ్– రాత్రిపూట నర్మదానదిని దాటి వెళ్లుచున్నది.

తత్ర....గ్రాహాః– నర్మదానది నీటిలో మొసళ్లున్నవి.

48 పుట: మర్మజ్ఞానైవ సుందరీ- ఆమె సుందరిమాత్రమే కాదు, మర్మజ్ఞురాలు కూడ.

49 పుట: రామలక్ష్మణులు; పానుగంటి లక్ష్మీనరసింహారావు రచించిన కంఠాభరణము నాటకమునందలి పాత్రలు. ఆశుకవులు. కనిపించినవారిమీద నెల్ల చచ్చు పద్యములు రచించి డబ్బు సంపాదించుట వీరి వృత్తి. ఆశు కవిత్వమెంత అభాసు పాలయినదో చూపుటకు రచయిత యీ పాత్రలను సృష్టించెను.

# శ్రీ ముళ్ళపూడి వేంకటరమణ

## "పగటి కలలు"

ఇటీవలికాలములో కథానికా రంగమున ప్రసిద్ధులైన రచయితలలో ముళ్లపూడి వేంకటరమణ అగ్రేసరులు సుకుమారమైన వ్యంగ్యధోరణిలో సమాజములోని లోపములను అవహేళనచేయుచు కొరడాదెబ్బవలె చురుక్కు మనిపించగల వచన రచన చేయగలవారు శ్రీ వేంకటరమణ.

వేంకటరమణ బహు కథానికలు రచించినారు. ఆయన కథలలో మధ్య తరగతి కుటుంబాలు, సినిమారంగము, రాజకీయ నాయకులు, పట్టణీకరింపబడిన పల్లెటూరివారు ఇట్లు దేశపు అధునాతన రూపము కళ్లకు కట్టినట్లుండును, సినిమా కథా రచయితగాకూడ ఆయన సుప్రసిద్ధులు.

వేంకటరమణ రచనలో తెలుగు పలుకుబడి క్రొత్త సొగసులు పోయినది. ఎన్నో పదాలు కలసిపోయి కొత్తరూపమును పొందినవి. క్రొత్త అర్థమును సంతరించుకొనినవి. వ్యావహారిక వచన రచనలో తన ప్రత్యేక శైలిని నిర్మించుకొని, చప్పున గుర్తుపట్టగల రీతిని పెంపొందించుకొనిన రచయిత ఈయన.

'రాజకీయ భేతాళ పంచవింశతిక' మొదలైన వారి కథలలో ప్రాచీన కథలు అధునాతన సామాజిక చైతన్యాన్ని వ్యక్తీకరించుచు అందు కనుగుణమైన నూతన స్వరూపమును పొందినవి.

'పగటి కలలు' అన్న వ్యాసముతో ఆయన సమాజములోని ఒక మనో లక్షణమును వ్యాఖ్యానించి చూపినాడు. లౌకికముగా తమ కోరికలను తీర్చుకోలేనివారు, భావనాదశలో వానిని పొందినట్లుగా తృప్తిని పొందుట సామాన్య విషయము. ఈ వ్యాసము ఆ మనోలక్షణమును వెల్లడించుచున్నది.

ఇంకొక రీతిలో ఈ వ్యాసము మధ్యతరగతి జీవనములోని చాలీచాలని పేదతనమును, మానసిక దైన్యములను వ్యక్తము చేయుచున్నది.

# శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

## "బహుకాల దర్శనం"

ఈ పాఠ్యభాగము శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి 'బహుకాలదర్శనం' అనే వచన రచనల సంపుటినుండి స్వీకరింప బడినది.

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి (1898) ఈ శతాబ్దములోని ఆధునిక కవితోద్యమ మూలస్తంభములలో నొకరు భావకవితా ప్రపంచమునకు కృష్ణశాస్త్రి పేరు పర్యాయపదము ఆత్మాశ్రయ ధోరణిలో గాఢమైన అనుభూతిని వ్యక్తీకరించుటలో వారి స్థానము అపూర్వమైనది. కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి మొదలైన వారి కావ్యములు తెలుగు కవిత్వములో నూతన భావుకతకు దారులు తీసినవి.

కృష్ణశాస్త్రి వచవ రచనలో కూడ ఒక ప్రత్యేకమైన రీతి కలవారు. అదివారి లోకానుభవమును అర్ద్ర మనోలక్షణమును వ్యక్తము చేయును. అచ్చమైన తెలుగు నుడికారము కృష్ణశాస్త్రి వచన రచనకు ఒక వైలక్షణ్యమును సమకూర్చినది.

'బహుకాల దర్శనం' లోని శ్రీరాములు విచిత్రమైన వ్యక్తి. అసహాయోద్యమములో పాల్గొని జైలుపాలయి, ఆస్తి పోగొట్టుకొన్న దేశభక్తుడు. కాని స్వాతంత్ర్యము వచ్చిన తరువాత కొత్తగా అధికారములోనికి వచ్చినవారు ఇట్టివారిని గూర్చి పట్టించుకొనలేదు. వారి దయనీయమైన స్థితిని వర్ణించుట ఈ రచనలోని ప్రధానాంశము.

ఈ రచన రూపకప్రాయమైనది. రేడియో రూపకాల రచన దృశ్యరూపకాల రచన కంటె విలక్షణమైనది. ఇక్కడ దృశ్య సన్నివేశములోని హావభావ ప్రదర్శనముండదు. అంతయు అప్రత్యక్షముగా నుండి వినెడి వారికి సంభాషణల ద్వారా, వివిధ ధ్వనులద్వారా సర్వము నవగతము కావలెను.

రచన చమత్కారముతో ప్రారంభమయి క్రమముగా కరుణము రూపొందును.

# శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

## 'చుట్ట'

నవ్య సాహిత్యపు తొలినాళ్ళలో తెలుగు కథానికను చేపట్టి దానినొక కళా ఖండముగా తీర్చిన ఘనత మునిమాణిక్యం నరసింహారావు గారిది. మునిమాణిక్యం రచనలలో ఎక్కువ కథానికలే. కొన్ని చిన్న నవలలు, వ్యాసములు మరికొన్ని.

మధ్యతరగతి కుటుంబ జీవనమునకు, అందును భార్యా భర్తల మధుర సంబంధమునకు, ఈయన కథలలో అద్దము పట్టినారు. గృహిణీ లక్షణములకు ఆదర్శముగా ఆయన 'కాంతం' పాత్ర రూపొందినది. స్త్రీల్లోని చమత్కారము. గడుసుదనము, ఆప్యాయత, అనురాగ మాధుర్యములు ఈమెలో ప్రతిఫలించును. కాంతం కథలు, తిరుమాళిగ, రుక్కుతల్లి, మొదలైన రచనలు ప్రసిద్ధములైనవి.

మునిమాణిక్యం రచనలలోగల సున్నితమైన హాస్యము ఆయనను ప్రసిద్ధుని చేసినది. హాస్యమునుగూర్చి ఆయన సిద్ధాంత వ్యాసములుకూడ వ్రాసెను. 'మన హాస్యము' అన్న గ్రంథము తెలుగులో హాస్యమునుగూర్చి వ్రాసిన మొదటి విపుల గ్రంథము.

ప్రస్తుత వ్యాసము "చుట్ట" విచిత్రమైన లక్షణముగలది. ఆ కాలమున నాగరక సమాజములో విపుల ప్రచారముగల 'చుట్ట'ను ప్రశంసచేయుట దీనిలక్ష్యము. మనలో దేనికైనను పౌరాతన్యము నంటగట్టుట, మహా గ్రంథములలో దాని ప్రశంస కలదనుట ఒక సామాన్య లక్షణము. చుట్ట ప్రశంస విజయమునకు భారతాది గ్రంథములలో లేకపోయినను దీనియందు 'చుట్టుకోను' 'చుట్టయినకావిమ్ము' మొదలైన శబ్దము లాధారముగా చుట్టయొక్క గొప్పతనము చమత్కారముగాచెప్పు ప్రయత్నము జరిగినది.

